# చెకోవ్ కథలు

పల్లెపట్టు
సార్జంటు
ముద్దాయి

# చెకోవ్ కథలు

## చెకోవ్

3-7-50

*

అనువాదం:

## ప్రయాగ



త్రిలింగ పబ్లిషింగ్ కంపెనీ
గవర్నరుపేట : విజయవాడ 2.

ప్రతులు 1500
వెల: రూపాయి
మే: 1950



ఇందులో

* పల్లెపట్టు
* సార్జెంటు
* ముద్దాయి

ప్రతులకు
జనత బుక్ హౌస్
విజయవాడ 2.

# చెకోవ్

"ఎంత అసంబద్ధమైన, అసాధ్యమైన దేశం - మన రష్యా!"

ఇదీ ఆయనదగ్గర తరచుగావచ్చే చర్చ : ఆయన గంభీరంగా నిష్కపటంగా ఆప్యాయంగా మాట్లాడే వాడు - మధ్యమధ్య అకస్మాత్తుగా, తనలో తాను, తాను చెప్పేదాన్ని తలచుకొని నవ్వుకునేవాడు. ఆ విషణ్ణమృదుహాసంలో, వాక్కులయొక్క, చిరస్వప్నాల యొక్కా విలువలు తెలిసిన ఒక మహావ్యక్తిలోని ఉదాత్త సందిగ్ధత గోచరించేది. ఆ నవ్వులోంచి ప్రేమాస్పదమైన ఒక వినమ్రతా, సున్నితమైన ఒక సహృదయత్వమూ తొంగిచూచేవి.

చక్కగా సాదాగా వుండే ఆ వ్యక్తి, స్పష్ట మైన నిష్కపటమైన, నిజమైన ప్రతివిషయాన్నీ ప్రేమించేవాడు. ప్రజల్ని మరీ స్పష్టతరం చెయ్యటం లో ఆయన కొక ప్రత్యేకపంథా వుంది.

ఎక్కడ పడితే అక్కడ, దెబ్బగొట్టి అసభ్య తను నిర్మూలించే కళ ఆయన సొమ్ము. అది జీవి

తంలో ఉన్న తాశయాలుగల వ్యక్తికిమాత్రమే సాధ్యమయ్యే కళ; ప్రజల్ని స్పష్టంగా చక్కగా సమైక్యంగా చూడాలనే తీవ్రవాంఛ ఉన్నప్పుడుమాత్రమే ఉత్పన్నమయ్యే కళ. అసభ్యతకు ఆయన ఆగర్భ శత్రువు.

ఒక్కొక్కనాడు, చక్కగా అలంకరించుకున్న ఓ చక్కని దొరసాని వచ్చి ఆయనతో "చెకోవ్ పద్ధతిలో" మాట్లాడటం మొదలుపెట్టేది.

"జీవితం నిస్సారమైంది, చెకోవ్! ప్రతి వస్తువుకూ వృద్ధాప్యం వచ్చినట్టు కనిపిస్తుంది. మనుష్యులు, ఆకాశం, సముద్రం అన్నీ అంతే; చివరకు పూలుకూడా ముదిసిపోయినట్టు కనిపిస్తున్నాయి. ఇంకా నాకు కోరికలు లేవు ... హృదయంనిండా నిస్పృహ; ఇదొకరకం వ్యాధిలాగా—"

"ఔను, అది వ్యాధే! దానికి లాటిన్‌లో పేరుకూడా వుంది: మోర్బస్ ప్రిటెండియాలిస్ అని." అని నిశ్చితంగా చెప్పేవాడు చెకోవ్.

"అరక దున్నుతున్న గుర్రాన్ని కుడతాయే జోరీగలు— అలాంటివాళ్ళు విమర్శకులు," అని తెలివిగా చిరునవ్వు నవ్వుతూ అనేవాడు: "గుర్రం అరక దున్నుకు పోతూవుంటుంది. దాని కండరాలన్నీ తంబురా తీగెల్లాగా బిర్రబిగుసుకుని వుంటాయి. కాని జోరీగకు అదేమీ అవసరంలేదు. దాని పీవు

మీాదవాలి, కుట్టి; 'జు'మ్మంటుంటే సరిపోతుంది. పాపం, ఆగుర్రం చర్మం ముణగదీసుకుని తోకతో విసురుకోవలసి వస్తుంది. అసలు ఈ జోరీగ దేనికోసం, 'జుం' అంటూ తిరుగుతూ వుంటుంది? ఎందుకో దానికే తెలిసివుండదు. పట్టి చలచిత్తంతో, "నేను కూడా ఈ జగత్తులో వున్నాను. చూడండి, నేను 'జు'మ్మనగలను కూడా. దేనిచుట్టూతానైనా 'జు' మ్మంటూ తిరగగలను! చూడండర్రో!" అని తన ఉనికిని తెలియజెప్పటంకోసం లాగా కనిపిస్తుంది ఈ జోరీగ వ్యవహారం. ఇప్పటికి పాతికేళ్ళనుంచీ నాకథలమీాద వచ్చిన విమర్శలు చదువుతున్నాను. కాని వాటిలో ఏముందో ఒక్క చిన్నవిషయం కూడా గుర్తులేదు. ఎన్నడూ ఒక్క మంచిసలహా అయినా వినిపించలేదు. ఒక్కసారి మాత్రమే, స్కాబిషేవిస్కీ వ్రాసిన విమర్శ, నామనస్సును తగి లింది: నేను ఏకంపకిందనో నిషాతో చచ్చిపోతా నని ఆయన వ్రాసాడు."

అలా తిరస్కరింలచవలసి వచ్చినందుకు ఆయన విచారించేవాడు. అంతేకాక, తన ఎదుట ఎవరైనా ఎవరిని గురించిగానీ కఠినంగా మాట్లాడినప్పుడు, ఆయన కలిగించుకొని అనేవాడు:

"ఇదంతా దేనికి? పాపం, అతను పెద్దవాడై పోయాడు – అప్పుడే డెబ్బైఏళ్లొచ్చాయి."

అనిగానీ, లేకపోతే –

"ఎందుకు, పాపం-అతనికా చిన్నవాడు బహుశా ఏదో తెలివితక్కువవల్ల చేసివుంటాడు." అనిగానీ.

కాని, అలా అనేటప్పుడు ఆయన మొహంలో ఏమీ అసహ్యాభావం కనిపించేదికాదు.

ఎప్పుడూ పవిత్రమైన నమ్రతతో ప్రవర్తించే వాడు. మనుషులతో బిగ్గరగా బహిరంగంగా మాట్లాడటం ఆయన కిష్టంలేదు.

"మనం ఇంకా మర్యాదగా మాట్లాడాలి!" అనుకునేవాడు. మర్యాదగా ఉండవలసిన అవసరాన్ని ప్రజలు తమంతటతామే గుర్తిస్తారని ఆయన వ్యర్థంగా ఆశించేవాడు. అసభ్యతనూ నైచ్యాన్నీ ద్వేషిస్తూ, జీవితంలోని అసహ్యాతలను ఉదాత్త కవితా భావంలో, చమత్కారంగా నవ్వుతూ, వర్ణించేవాడు.

అసభ్యత ఆయనశత్రువు. జీవితమంతా దానికి వ్యతిరేకంగా పోరాడాడు. అసభ్యత తాలూకు బూజు ఎక్కడ మిగిలివున్నాసరే, చూడగానే అంతా సవ్యంగా పేరు ప్రతిష్ఠలతో వున్నట్టు కనిపించే ప్రదేశాల్లో వున్నప్పటికీ, పసిపట్టేవాడు. తన పదునైన నిష్పక్షపాతమైన లేఖినితో ఆయన అసభ్యతను, వెటకారం చేస్తూ, చిత్రించాడు. కాని ఆయన శరీరం – ఒక కవిశరీరం – చివరకు ఉప్పు చేపలు మోసే కారులోకి ఎక్కించటంతో, ఆ అసభ్యతే ఆయనమీద ప్రతీకారం చేసింది.

NPR01C106

డస్సిపోయిన విరోధిమీద అసభ్యత జయోన్మాదంతో చేసిన వికటాట్టహాసంకంటే, ఆ మురికి కారు, నాకు అన్యథా కనిపించటంలేదు...

తొలి ప్రపంచయుద్ధానికి ఆయన పదేళ్ళ ముందు చనిపోకపోయినట్లయితే, ప్రజా ద్వేషంతో, ఆ యుద్ధం, ముందు ఆయనకే విషంపెట్టి చంపేది.

తన సాహిత్య కృషిని గురించి ఆయనబొత్తిగా ఇష్టంలేనట్లు, చాలాకొద్దిగా – 'పవిత్రంగా' అనవచ్చు – మాట్లాడేవాడు. టాల్‌స్టాయ్‌మాట వచ్చినప్పుడుకూడా ఆయన అలాగే వివక్షగా మాట్లాడేవాడు. ఎప్పుడో అరుదుగా మాత్రమే, ఏదో ఒక సంతోషసమయంలో, చిరునవ్వు నవ్వుతూ, ఒకకథా వస్తువు–సాధారణంగా నవ్వువచ్చే కథే చెప్పేవాడు.

"మీకు తెలుసా, నేను ఒక పంతులమ్మను గురించి వ్రాయబోతున్నాను. ఆమె నాస్తిక వాది డార్విన్‌ను ఆరాధిస్తుంది. సామ్రాజ్య ప్రజల్లో మూఢ విశ్వాసాన్ని గుర్తించింది. నిర్మూలించవలసిన అవసరాన్ని ఆమె రాత్రిపూట ఒక పిల్లిని పట్టుకుని నీళ్ళలో వుడకబెడుతుంది– దాని శరీరంలోనుంచి ఒక గుండ్రటి ఎముక తీసుకుందామని; ఆ ఎముక తన దగ్గర వుంటే, అది తనకిష్టమైన పురుషుణ్ని ఆకర్షించి, అతను తనను ప్రేమించేట్టు చేస్తుందని ఆమె నమ్మకం – వుందిలే, అలాంటి ఎముక ఒకటి–"

తన నాటకాలు 'సరదా'గా వుంటాయనే వాడు; తాను ప్రధానంగా అలాంటి నాటకాలే వ్రాస్తున్నానని ఆయన విశ్వాసం. బహుశః ఇందు వల్లనే శావా మొరోజోవ్ ఇలా నొక్కి వక్కాణించాడు:

"చెకోవ్ నాటకాలు గేయ నాటకాలలాగే ప్రదర్శించవలసినవి" అని,

నవ్వుతున్నప్పుడు ఆయన కళ్ళు అందంగా – తల్లి కళ్ళలాగా దయగా ఆర్ద్రంగా – వుండేవి. ఆయన నవ్వు – దాదాపు నిశ్శబ్దంగా – మరీ బాగా వుండేది. ఆ నవ్వటంలో నిజంగా ఆయన ఆనందం పొందే వాడు: అంత 'ఆధ్యాత్మికంగా' నవ్వగల వాళ్ళను నేను చూడలేదు.

టాల్‌స్టాయిని గురించి వచ్చినప్పుడల్లా, బయటికి స్పష్టంగా కనిపించే ప్రత్యేకమైన మార్దవంతో, కళ్ళల్లో జంకుతున్నట్టు తోచే చిరునవ్వుతో, మాట్లాడేవాడు. గొంతు తగ్గించి-జాగ్రత్తగా మృదు పదాలతో మాట్లాడవలసిన ఏదో ఒక నిగూఢ శక్తిని గురించి మాట్లాడుతున్నట్టు మాట్లాడేవాడు.

అలాంటి వ్యక్తిని, చెకోవ్‌ను, జ్ఞాపకం చేసుకోవడం మంచిది: మన జీవితాల్లో ఒక కొత్తశక్తి ఆవహిస్తుంది; ఒక స్పష్టమైన దృక్పథం ప్రవేశిస్తుంది.

మాక్సిం గోర్కీ

# పల్లెపట్టు

౧

నికోలాయ్, స్లావ్యాన్స్కి వీధిలోని మాస్కో హోటల్లో, వెయిటరు. ఏదో వ్యాధితో కొంత కాలంగా బాధపడుతున్నాడు. ఒకనాడు పళ్లెంనిండా తినుబండారాలు పెట్టుకొని, కావలసినవారికి అందించేందుకు పోతున్నప్పుడు, వసారాలోంచి నడుస్తూ నడుస్తూ, నరాలు కొంకర్లుపోయి, కాళ్ళు తూలిపోయి పడిపోయాడు. తర్వాత ఆపనికాస్తా మానుకోవలసి వచ్చింది తన దగ్గిరా తన భార్యదగ్గిరా వున్న నాలుగు డబ్బులూ డాక్టర్లకిందా మందుకిందా ఖర్చుపెట్టారు. మరి బ్రతకాలంటే చేతిలో గుడ్డిగవ్వ లేకుండా పోయింది. ఏమీచెయ్యలేని తన సోమరితనం భారమనిపించి, నికోలాయ్, మాస్కో వదిలేసి తన స్వగ్రామానికి వెళ్లిపోదామనుకున్నాడు. జబ్బుతో వున్నప్పటికీ ఇంటిదగ్గిర ఇంతకంటే నయంగా వుంటుంది. అక్కడ జీవితంకూడా చౌకగా గడు

స్తుంది. ఉన్న ఇంట్లో తాగిన గంజే పరమాన్నమని ఊరకే చెప్పలేదుగదా!

అనుకున్న సాయంత్రానికల్లా తన స్వగ్రామం (ఝుకోవో) చేరుకున్నాడు. నికోలాయ్ తాను పుట్టిన ఇంటిని ఎప్పుడో చిన్నప్పుడు చూసినగుర్తు. అప్పుడు అది ఎంతో అందంగా హాయిగా వుండేది. కాని, తీరా ఇప్పుడు తన దనుకునే ఒక చెక్కలగదిలోకి అడుగు పెడుతూ, అతను నివ్వెర పోయాడు. ఆ యిల్లేనా ఇది? జనంతో క్రిక్కిరిసి, అంతా చీకటి, మురికి! నికోలాయ్‌తోపాటు వచ్చిన అతని భార్య వోల్గా, కూతురు శాషా కూడా ఆ చెక్కల కొట్లో ప్రవేశించారు. వాళ్లు లోపల అడుగుపెట్ట డంతోటే, గది సగానికి ఆక్రమించి, చుట్టూ మసీ ఈగలూ - అసహ్యంగా వున్న 'స్టవ్' పంక ఆశ్చ ర్యంగా చూశారు. స్టవ్, మరీ ఎగుడు దిగుడుగా వుంది. గది గోడలకున్న చెక్కలు లోపలకివాలి, ఏక్షణమో కూలిపోయేట్టున్నాయి దేవుడి మూల, గోడమీద - బొమ్మలకు బదులు - పత్రికల పీలి కలూ, సీసాలమీద 'లేబిల్సూ' అతికించి వున్నాయి. దరిద్రం! ఎటుచూచినా ఒకటే దరిద్రం!

పెద్దవాళ్లెవళ్ళూ ఇంటిదగ్గర లేరు. అందరూ మాసూళ్ళ పనిలో కెళ్ళారు. పట్టుకుచ్చులాంటి

జుట్టుతో, ఓఎనిమిది దేళ్ళ పిల్ల స్టవ్ మీద కూర్చొని వుంది. స్నానం చెయ్యనట్టు మురికిగా, నిర్లక్ష్యంగా వుంది. ఈ కొత్తగా వచ్చిన కుటుంబంవంక ఆ పిల్ల కన్నెత్తి అయినా చూడలేదు. అక్కడే ఒక తెల్లటి పిల్లి పొయ్యికడ్డీకేసి ఒళ్లు రుద్దుకుంటున్నది.

దాన్ని చూచి, శాషా : "చీలీ, చీలీ!...పీస్ ...పీస్..." అని ఉత్సాహంగా పిలిచింది.

"దానికి వినబడదు; చెవుడు!" అంది ఆ ఎనిమిదేళ్ళ పిల్ల.

"చెవుడెందుకొచ్చింది? పాపం..."

"ఆఁ... దానికి దెబ్బతగిలిందిలే!"

ఇక్కడి జీవితం ఎలావుందో, తొలి చూపులోనే, నికోలాయ్ వోల్గాలు అర్థంచేసుకున్నారు. కాని ఒకరికొకరు ఏమీ చెప్పుకోలేదు. మెదలకుండా, తమ మూటలు అక్కడ పెట్టి, నిశ్శబ్దంగా వీధిలో కెళ్లిపోయారు. ఆ వీధి చివరినించి చూస్తే తమ యిల్లు మూడోది, అన్నింట్లోకీ దరిద్రంగానూ పురాతనంగా కనిపిస్తున్నది. రెండోదికూడా అంతంత మాత్రంగానే వుందిగాని, ఆ చివరిదిమాత్రం – పైన ఇనపరేకుల కప్పుతో, కిటికీ తెరలతో – చక్కగా వుంది. ఆ కుటీరం తక్కినవాటితో సంబంధం లేకుండా, ఎడంగా వుంది. అదే అంగడి – ఊళ్ళో

ఇళ్లన్నీ ఒక్కటే వరసన వున్నాయి. ఊరంతా తీగ లతోను, పూలచెట్లతోను దొడ్లలోంచి తొంగి చూస్తున్న కొండ మొక్కలతోను ప్రశాంతంగా, గంభీరంగా-హాయిగా కనిపిస్తున్నది.

రైతుల కొట్టాల వెనుక నేల నదివైపుకు లోతుగా దిగిపోయి, అక్కడక్కడా కొండరాతిచట్లు పొడుచుకువచ్చివుంది. ఆ దిగుడులో కాలిబాటలు ఆ బండలనూ, కుమ్మర్లు తీసిన గోతులనూ చుట్టుకొని పోతున్నాయి. గోధుమ రంగువీ, ఎర్రటివీ కుండ పెంకులు గుట్టలుగుట్టలుగా పడివున్నాయి. ఇంకా దిగువన, విశాలమైన చదునైన ఆకుపచ్చని మైదానం వుంది. పైరు కోసుకుపోగా, మిగిలిన గడ్డిపరకలకోసం అక్కడే రైతుల గొడ్లు ఇప్పుడు తిరుగాడుతున్నాయి. ఊరికి అయిదారు ఫర్లాంగుల్లో, ఆ నది, చెట్లతో అందంగావున్న తీరాన్ని ఒరుసుకుంటూ మెలికలు తిరిగి కోసుకుంటూ పోతున్నది. దానికవతల ఆ విశాలమైన మైదానం; అందులో గొడ్లమందలూ, బార్లుతీరి వున్న తెల్లటి బాతులూ; మళ్ళీ ఇటు వైపున లాగానే అటుకూడా నిట్టనిలువుగా మిట్ట ప్రాంతమూ, దానిమీద ఆ అంచున ఐదు గోపురాల చర్చీ, దానికి కొంచెం దూరంలో జమీందారు భవనం - కనిపిస్తున్నాయి.

చర్చిని చూడగానే వోల్గా చేతులు జోడించింది. "ఇక్కడ చక్కగావుంది. భగవంతుడా, ఎంత మంచిప్రదేశం !" అంది.

సరిగా అదే సమయానికి సౌందర్యదేవత శుక్రుణ్ణి సంగీతించటానికి చర్చి గంటలు మ్రోగాయి (అది శనివారం సాయంసమయం). ఆ క్రిందుగా, నీళ్ళ బొక్కెన మోసుకు పోతున్న ఇద్దరు చిన్న పిల్లలు సంగీతంకోసం చర్చి వంకకు కళ్ళుతిప్పారు.

"స్లావ్యాన్స్కి వీథిలో ఈ సరికి అన్నాలు వడ్డిస్తుంటారు." అన్నాడు కలగంటున్నట్లుగా నికోలోయ్.

గట్టు అంచున కూర్చొని నికోలోయ్ వోల్గాలు సూర్యాస్తమయాన్ని పరికిస్తున్నారు. ఆ బంగారపు ఎర్రటి ఆకాశం - నదిలోనూ; చర్చి కిటికీలమీదా మాస్కోలో ఎన్నడూ లేనిమాదిరిగా, మృదువుగా ప్రశాంతంగా చెప్పలేనంత పవిత్రంగా ఉన్న ఆ వాతావరణ మంతటా ప్రతిఫలించటం గమనించారు. సూర్యుడు అస్తమించగానే, మట్టలెగబట్టుకొని అరుచుకుంటూ గొడ్ల మందలన్నీ వెళ్ళిపోయాయి. బాతులు అవతలినుంచి నదిమీదిగా ఎగిరి వచ్చేసాయి. తర్వాత అంతటా నిశ్శబ్దం ఆవరించింది. వాతావరణంలోని ఆ మృదుకాంతులు అంతరించి, చీకటి వేగంగా అలముకోసాగింది.

నికోలాయ్ తల్లిదండ్రులు, ఇద్దరూ ఒకే ఎత్తున, సన్నగా నడుం వంగిపోయి, పళ్ళులేని ముదుసళ్లు, అప్పుడే ఇంటికి వచ్చారు. నది అవతల పొలంలో అంతదాకా పనిచేస్తుండిన కోడళ్ళిద్దరూ - మార్యా, ఫ్యోక్లా - కూడా వచ్చారు. నికోలాయ్ సోదరుడైన కిర్యాక్ భార్య మార్యాకు ఆరుగురు బిడ్డలు; మరో సోదరుడు డెనిస్ భార్య ఫ్యోక్లాకు ఇద్దరు బిడ్డలు. డెనిస్ ఇప్పుడు సైన్యంలో వున్నాడు. నికోలాయ్ ఇంట్లో అడుగు పెట్టగానే ఈ కుటుంబాన్నంతటినీ చూసాడు. చిన్నవీ పెద్దవీ స్వరూపాలు మంచాలమీద, ఉయ్యాలల్లోనూ, అన్ని మూలలా కదలాడుతూండటం చూసాడు. తన ముదుసలి తండ్రీ, ఆ స్త్రీలూ ఆనల్లటి మట్టి రొట్టెను నీళ్ళలో ముంచుకొని తినే ఆ పేరాస చూస్తే తాను చేసింది తప్పేమో అనిపించింది. జబ్బుచేసి, చేతిలో దమ్మిడీ లేకుండా, అందులో కుటుంబంతో సహా - ఇక్కడికి రావటం నిజంగా తప్పే అనుకున్నాడు.

పరస్పరం కుశల ప్రశ్నల అనంతరం "మరి సోదరుడు కిర్యాక్ ఎక్కడ?" అని అడిగాడు.

"వాడొక వర్తకుడి దగ్గర కావలివాడుగా వుంటున్నాడు. అక్కడే అడవుల్లో వుంటాడు. వాడు పని తెలేని వాడు కాడు, కాని తాగుడుపిచ్చ అమితం." అని తండ్రి జవాబు చెప్పాడు.

వాడేమీ తిండి తెచ్చిపెట్టేవాడు కాడు. ఈ యింట్లో మొగాళ్ళు వట్టి దరిద్రులు. ఇంటికి దమ్మిడీ తెచ్చేది లేకపోగా, చేతికి చిక్కిందల్లా ఎత్తుకు పోతారు. కిర్యాక్ తాగుడు వుండనేవుంది. ఈ ముసిలాయన కూడా అంగడిదోవ బాగానే తెలుసు – పాపం దాచుకొని ప్రయోజనం లేదు. భగవంతుడి ఆగ్రహమంతా మామీదేవుంది." అన్నది కన్నీళ్ళతో తల్లి.

అతిథులకోసమని టీ మళ్ళీ వేడిచేసారు. కాని చేపలకంపు కొడుతున్నది. పంచదార నల్లపడి గడ్డ కట్టుకుపోయి చుట్టూ ఎలుకలు కొరికినట్లుంది. రొట్టెలమీద కుండలమీదా చట్లమీదా బద్దెంకులు ప్రాకులాడుతున్నాయి. ఆ టీ త్రాగటం విసుగ్గా వుంది. సంభాషణకూడా – ఎప్పుడూ దరిద్రాన్ని గురించీ జబ్బుల్ని గురించీ – మరీ విసుగ్గావుంది. అలా నాలుగు గుటకలు మింగారోలేదో, అంతలో దొడ్లోనుంచి భయంకరంగా ఓ తాగుబోతు కేక వినిపించింది :

"మా...ర్యా...!" అని

కిర్యాక్ వస్తున్నట్టుంది. ఆరాక్షసి మాటలే–" అన్నాడు తండ్రి.

క్షణం నిశ్శబ్దం. మళ్ళీ అదే గొంతు – భయం కరంగా, నూ తి లోం చి లా గా – ఏదో భూగర్భంలోనుంచి వస్తున్నట్టు.

"మా...ర్యా !"

పెద్దకోడలు మార్యా అంతలో తెల్లబారి, స్టవ్ మీాదికి తూలిపోయింది. ఆ బలిష్టురాలైన గృహిణి మొహంమీద ఆ భయోత్పాతం విపరీతంగా కనిపిస్తున్నది. స్టవ్ మీాద కూర్చొని ఏదీ పట్టనట్టు చూస్తున్న చిన్న పిల్ల, మార్యా కూతురు హఠాత్తుగా పెద్దపెట్టున ఏడవటం మొదలెట్టింది.

"ఎందుకే ఏడుస్తావు ? చీడముండా ! మీఅమ్మనేం చంపడులే ! భయంలేదు !" అని బలంగానూ చక్కగానూ వున్న ఫ్యోక్లా బిడ్డను గదమాయించింది.

కిర్యాక్తో కలిసి అడవుల్లో నివసించటానికి మార్యా భయపడుతున్నదనీ; అతను తాగినప్పుడల్లా ఆమెమీాదికివచ్చి హంతకుడిలాగా నిర్దాక్షిణ్యంగా చావగొట్టి పోతాడనీ – తండ్రి చెప్పగా, అప్పుడే నికోలాయ్ తెలుసుకున్నాడు.

"మా–ర్యా" ఈసారి కేక గుమ్మంలోనే వినిపించింది.

"దేవుడి మొహంచూసి నన్ను రక్షించండి!" అని మార్యా అగ్నిగుండంలో పడబోతున్నదానిలాగా, గొంతు పెగలకుండా ఏడుస్తున్నది.

ఇంట్లో పిల్లలందరూ ఏడుస్తున్నారు. వాళ్ళను చూచి, శాషా కూడా ఏడుపు మొదలెట్టింది. ఒక తాగిన దగ్గు వినిపించింది. నల్లటి గడ్డంతో ఓ పొడు గాటి రైతు చలిటోపీ పెట్టుకుని లోపలికి అడుగు పెట్టాడు. ఆ చిన్న దీపపు గుడ్డివెలుతురుకు ముఖం కానరాకపోవటంవల్ల, అతడు మరీ భయంకరంగా కనిపిస్తున్నాడు. అతను కిర్యాక్. సూటిగా భార్య దగ్గరకెళ్లి చెయ్యెత్తి, మొహాన ఒక్క పోటు పొడి చాడు. దెబ్బకు అదిరిపోయి ఆమె మరి నోరెత్త లేకుండా, కూలబడిపోయింది. వెంటనే ముక్కు వెంట రక్తం వరదలు కడుతున్నది.

"ఎంత సిగ్గుచేటు! ఎంత సిగ్గుచేటు! అతిథుల ఎదటకూడా? ఎంత పాపం!" అంటూ, ముసలా యన స్టవ్ దగ్గరకు చేతుల్తో ప్రాకిపోతూ, గొణు క్కున్నాడు.

ముసలావిడ, గూనిదాలాగా, ఆలోచనలో మునిగిపోయి కూర్చొనివుంది. ఫ్యోక్లా ఉయ్యాల ఊపుతున్నది.

తాను భయోత్పాతం కలిగించగలిగినట్టు తెలుసుకొని, కిర్యాక్ లోలోపల సంతోషించాడు. మార్యాను చెయ్యిపుచ్చుకొని గడపకళ్లి ఈడ్చుకు పోతూ, ఇంకా భయంకరంగా కన్పించాలని మృగం

లాగా గాండ్రించాడు. కాని అప్పుడే అతిధుల్ని చూసి, అంతలో ఆగిపోయాడు.

భార్యనువదిలేసి, "ఓహో, చుట్టాలువచ్చారా! నా సొంతసోదరుడు కుటుంబంతో సహా..." అన్నాడు.

తూలుకుంటూ సరాసరి దేవుడు మూలకు వెళ్ళి, రక్తం కక్కుతున్న, తాగిన కళ్లువిప్పి ప్రార్థన ప్రారంభించాడు :

"నా ప్రియసోదరుడూ అతని కుటుంబమూ మాస్కోనించి పితృగృహానికి వచ్చారు. మాస్కో, ఆ పురాతన రాజధానీ నగరం, నగరాలకు తల్లి నగరమైన మాస్కోనుంచి – నన్ను క్షమించు"

తర్వాత అతను బెంచీమీద, టీ పాత్రప్రక్కన కూలబడి, ఆ నిశ్శబ్దంలో సాసరులోంచి బిగ్గరిగా చప్పరిస్తూ, టీ తాగుతున్నాడు. వరసనే అలా పది పన్నెండు కప్పులు పీల్చేసి, ఆ బల్లమీద నిద్రకుపడి, గురకపెట్టటం ఆరంభించాడు.

తక్కిన అందరూ పడుకోబోతున్నారు. జబ్బుగా వుంటంవల్ల నికోలాయ్, తండ్రితోపాటు, స్టవ్ మీద పడుకోవాలి. శాషానేలమీద పడుకుంది. తక్కిన స్త్రీలతోపాటు వోల్గా పడుకోటానికి పాకలో కెళ్ళింది.

మార్యాప్రక్కన పాకలో గడ్డిమీద పడుకొని వోల్గా ఇలా చెప్పింది: "చూడు చెల్లీ, ఏడ్చి

లాభంలేదు. దైవభక్తి కలిగివుండు, చాలు! బైబిల్‌లో ఏం చెప్పివుందో తెలుసా: 'నీ కుడి చెంపన కొట్టినవాడికి రెండో చెంపకూడా చూపు' అని వుంది. అంతే, చెల్లీ!"

తర్వాత నెమ్మదిగా రాగసరళిలోలాగా మాస్కోనుగురించీ, తన జీవితాన్నిగురించీ, ధన వంతుల ఇళ్ళల్లో తాను పనికత్తెగా వుండటం గురించీ వాళ్ళకందరికీ చెప్పింది:

"మాస్కోలో ఆ యిళ్లు చాలా పెద్దవి. అన్నీ రాతి కట్టడాలు. చర్చిలుకూడా చాలా ... చాలా వున్నాయి ... నలభై ... నలభైలు ... ఆయిళ్ళల్లో అంతా మర్యాదస్తులే — ఎంత చక్కగా ఎంత తగు మనుషుల్లా వుంటారనీ?"

తానెన్నడూ మాస్కోకు పోలేదనీ, అంతే కాక, తమ జిల్లా పట్టణం కూడా చూడలేదనీ మార్యా చెప్పింది. ఆమెకు చదవటంగానీ వ్రాయ టంగానీ రాదు. కడకు "మా తండ్రీ!" అన్న ప్రార్థన కూడా రాదు. మార్యా, మార్యాకు కొంచెం దూరంగా వింటూ కూర్చున్న తోడు కోడలు ఫ్యోక్లా-ఇద్దరూ చాలా వెనకబడివున్నారు; బొత్తిగా వికాసం లేని మనస్సులు. ఆ యిద్దరికీ వాళ్ళ భర్తలంటే అసహ్యం. మార్యాకు కిర్యాక్

అంటేనే భయం. తనతో అతను ఉన్నప్పుడల్లా ఆమె హడలి పోతుండేది. అతనిలో జీర్ణించిపోయిన ఆ పొగాకు వోడ్కాల వాసనకు ఆమెకెప్పుడూ తల నొప్పి వస్తుండేది. "పాపం, భర్త దూరమైపోయాడు!" అని ఎవరన్నా అన్నప్పుడు, ఫ్యోక్లా కటువుగా జవాబు చెప్పేది: వాణ్ణి దయ్యాలు తన్నుకు పోనీ!" అని.

కొంతసేపు మాట్లాడుకున్నాక, వాళ్ళు నిశ్శబ్దంగా నిద్రలో మునిగిపోయారు.

చల్లనివేళ ఒక కోడి గొంతెత్తి, నిద్రాభంగం కలిగిస్తూ, కూతపెడుతున్నది. ప్రతి కంతలోంచీ ప్రాభాత నీలకాంతులు కనిపించటంతోటే, ఫ్యోక్లా ప్రశాంతంగా లేచి, బయటికి వెళ్ళిపోయింది. తర్వాత, ఆ దిసికాళ్ళు నేలమీద తపతపలాడుతూ, ఆమె ఎక్కడికో పరుగెత్తి పోవటం వాళ్ళు గమనించారు.

## ౨

మార్యాను తీసుకొని, వోల్గా చర్చికెళ్ళింది. వాళ్ళు సంతోషంగా ఆ మైదానం దిగుడు దోవన నడుస్తున్నారు. ఈ విశాల ప్రకృతి వోల్గాకు చాలా

ఇష్టంగా వుంది. తన కోడికోడలు తనకు ప్రియమైన అప్పురాలనే భావం మార్యాలో పొడసూపుతున్నది; సూర్యు డుదయిస్తున్నాడు. మైదానం దిగువన మత్తుగా ఒక డేగ ఎగురుతున్నది. నది స్వచ్ఛంగా వుంది. ఎక్కడెక్క డ మంచు తెరలు గాలిలో తేలి పోతున్నాయి. నది అవతలి ఒడ్డున కొండమీదిగా ఒక వెలుగుజాలు ఆకాశంలోంచి దూసుకు పోతు న్నట్టు కనిపిస్తున్నది. ఆ కాంతిలో చర్చి ప్రకాశ మానంగా వుంది. జమీందారు భవనం ప్రక్క నున్న తోటలో మాలకాకులు వెర్రిగా కూస్తు న్నాయి.

మార్యా వోల్గాకు ఇంటి ముచ్చట్లు చెబుతు న్నది : "ముసలాయన అంత చెడ్డవాడేంకాదు. ముసి లమ్మ చాలా ఖచితమైన మనిషి. ఇష్టంవచ్చినట్టు సాగించుకుంటుంది. మన పొలంలో గింజలు మొన్న పండగనాటిదాకా వచ్చాయి. ఇప్పుడు అంగడిలో కొనుక్కోవలసి వస్తున్నది. అందుకే ఆమెకు కోపం. మేము తినిపోతున్నామని అంటుంది."

"చూడు, చెల్లీ ! దేవుణ్ణి నమ్ము, అంతే ! 'బ్రతుకు భారమైన ఓ కష్టజీవులారా, నాదగ్గరకు రండి !' అన్న భగవదాదేశం బైబిల్‌లో వ్రాసి పెట్టి వుంది."

వోల్గా, రాగ సరళిలో, నిశ్చలంగా జవాబు చెప్పింది. తీర్థయాత్రకు వచ్చినవాళ్ళలాగా, ఆమె విరతిలేని వేగంతో నడుస్తున్నది. ఆమె ప్రతిరోజూ బైబిల్ చదువుతుంది; ప్రవక్తలాగా బిగ్గరగా చదువుతుంది. అందులో చాలా భాగం ఆమెకు అర్థంకాదు గాని, ఆ పవిత్ర పదజాలం ఆమె హృదయాన్ని కదలించేవి; కళ్ళు చెమర్చేవి. "ఆలోకించు!", "ఎవరైనప్పటికీ" అనే రకం మాటలు పలికేటప్పుడు ఆమె ఒక మధురమైన తన్మయత్వంతో ఊగిపోయేది. భగవంతుడిలోనూ, కన్యకలోనూ, ఋషుల్లోనూ, ఆమెకు విశ్వాసంవుంది; సామాన్య ప్రజకుగానీ జర్మన్లకుగానీ, అనాది జాతులకుగానీ, యూదులకుగానీ హానికలిగించటం దోషమనీ; జంతువుల్ని దయతో చూడనివాళ్ళకుసైతం దురదృష్టం తప్పదనీ – ఆమె నమ్మకం. ఇదంతా బైబిల్లో వ్రాసి వున్నదని ఆమె విశ్వాసం. అందువల్లనే, ఆమె బైబిల్లోని మాటల్ని ఉచ్చరించేటప్పుడు – వాటి అర్థం అంతుపట్టకపోయినా – ఆవేశంతో ముఖమంతా సున్నితంగా ఉద్రేకంగా చైతన్యవంతంగా కనిపించేది.

"మీ పుట్టినిల్లు ఎక్కడ?" అని మార్యా అడిగింది.

"మాది అసలు వ్లాడిమిర్ రాష్ట్రం. కాని చిన్నప్పుడే అంటే నాకు ఎనిమిదేళ్ళప్పుడు నన్ను మాస్కోకు తీసుకెళ్ళారు."

వాళ్ళు నదీతీరం చేరుకున్నారు. అవతలి ఒడ్డున ఒక స్త్రీ తన గుడ్డలు విప్పుకుంటూ నిలబడివుంది.

ఆమెను గుర్తిస్తూ మార్యా అన్నది : "అదే, అది మన ఫ్యోక్లా. నదిదాటి జమీందారు కోట లోకి వెళ్లివచ్చి వుంటుంది. ఆ జమీందారు మనుషుల్తో పోతుంటుంది. వట్టి చెడుకట్టె, విభాచారి ముండ – దాని బతుకే అంత !"

నల్లటి కనుబొమలతో, ఫ్యోక్లా ఇంకా యావనంలోనే వుంది; ఆమె ప్రతి కండరంలోనుంచీ యవనం తొంగిచూస్తూనేవుంది. ఒడ్డుమీదినుంచి ఒక్కసారి నదిలోకి దూకి, కాళ్ళతో నీటిమీద కొడుతూ, చుట్టూ కెరటాలు కదిలిస్తూ, ఈదుకుంటూ వస్తున్నది.

"వట్టి చెడుముండ – అది అంతే!" అని మార్యా మళ్లీ చెప్పింది.

నదిమీద ఓ చిన్న చెక్కవంతెన వుంది. క్రింత స్వచ్ఛమైన నిర్మల నీరంలో గుంపులు గుంపులుగా, చేపలు ఈదులాడుతున్నాయి. నీటిలో ప్రతిఫలిస్తున్న తీరంమీది పచ్చటి గుబుర్లు పొగ

మంచులో మిలమిల లాడుతున్నాయి. వాతా వరణం వెచ్చబడి, హాయిగొలుపుతున్నది. ఆ ఉదయము ఎంత అద్భుతంగా వుందని! ఆ ఉదయమే కాదు: ఈ ప్రపంచంలో జీవితంకూడా – దరిద్రం వల్లా, భయంకరమైన దరిద్రంవల్లా, ఎక్కడ దాక్కున్నా తప్పించుకో లేని ఈ దరిద్రంవల్లా కాక పోయినట్లయితే – ఎంత అద్భుతంగా వుండేది! ఊరివంక ఒక్కసారి చూడటమంటె మళ్ళీ నిన్నటి ఘటన లన్నీ జ్ఞప్తికి తెచ్చుకోవడమే; ఇప్పుడు తమచుట్టూతా తాము ఏ ఆనందానుభూతి పొందు తున్నట్లనిపించిందో, వాళ్ళకు అదంతా ఒక్క తృటిలో మటిమాయమై పోయింది.

ఇద్దరూ చర్చికెళ్లారు. మార్యా గడపలో నిల్చుంది. లోపలికి పోవటానికి ధైర్యం చాలలేదు. అప్పుడే ఎనిమిదిగంటలైనాక ప్రార్థనా సమావేశానికి గంట మ్రోగుతున్నది. కాని కూర్చోటానికైనా మార్యాకు గుండె లేదు. ఉన్నంతసేపూ మార్యా అలా నిల్చొనేవుంది

బైబిల్ చదివే సమయంలో జనం అకస్మాత్తుగా లేచి పక్కలకు సర్దుకొని జమీందారు కుటుంబం లోపలికి పోవటానికి త్రోవ యిచ్చారు. తెల్లటి దుస్తులు ధరించిన ఇద్దరు యువతులూ, నావికుడి దుస్తుల్లో వున్న ఒక పిల్లవాడూ ప్రవేశించారు.

వాళ్ల ఆకారం వోల్గా మనస్సులో హత్తుకుంది. తొలి చూపులోనే, వాళ్ళు విజ్ఞాన వివేకాలూ సంస్కారమూ కలవాళ్లని, వోల్గా నిశ్చయించుకుంది. వాళ్ళు మనుషులు కానట్లూ తాను తొలగకపోతే తనను నాశనంచేసే రాక్షసులైనట్లూ- మార్యా వాళ్లను కంటి అడుగునుంచి నిరసనగా నిస్పృహగా చూసింది.

మత గురువు ఉదాత్తనుదాత్తాలతో బైబిల్ చదువుతున్నప్పుడు ప్రతి క్షణమూ ఆమెకు "మా-ర్యా!" అన్న కేక జ్ఞాపకం వచ్చి, వణికిపోయింది కూడా.

## 3

వీళ్ల యింటికి చుట్టాలు వచ్చిన సంగతి ఊళ్లో అందరికీ తెలిసింది. ప్రార్థనానంతరం అనేకమంది సరాసరి వీళ్ల ఇంటికి వచ్చారు. మాస్కో మహాపట్టణంలో పనుల్లోవున్న ఈ చుట్టాలను గురించి పరామర్శించటానికి లియోలిషేవ్, మాట్వీషెవ్, ఇలీషేవ్ కుటుంబాలవాళ్లు వచ్చారు. అసలు ఝుకోవోలో వ్రాయటం, చదవటం నేర్చిన పిల్లలందర్ని

బంట్రోతులుగాను నౌకర్లుగాను పనిచెయ్యటానికి మాస్కోకు ఎప్పుడో పంపేస్తారు. ఈ ఆచారం బాని సత్వపు రోజుల నాటినుంచీ వుంది. (ఇలాగే, నది కవతలి ఊళ్లో పిల్లల్ని రొట్టెలు చేసేవాళ్లదగ్గిర పని నేర్చుకోటానికి పంపుతారు.) వెనుక ఒకానొకప్పుడు టీకా ఇవానిచ్ అనే రైతు ఝుకోవోనుంచి మాస్కో వెళ్లి అక్కడ ఒక క్లబ్ హోటల్లో పని చేస్తుండేవాడు. తనదగ్గిరగానీ తానెరిగిన ఇతర హోటళ్లలోగానీ పనివాళ్ళు కావలసి వచ్చినప్పుడు తన గ్రామస్తుల్ని మాత్రమే పిలిపించి ఆపనిలో ప్రవేశపెట్టేవాడు. అలా ఆ గ్రామంలోని వాళ్ళకు పనులు చూపించటం వల్ల అతను ఆ గ్రామానికి ఆరాధ్యపురుషుడైనాడు. ఆతని ద్వారా పనుల్లో కుదురుకున్నవాళ్ళు కూడా మళ్లీ కొత్త పనివాళ్ళు కావలసినచ్చేసరికి తమ ఊరివాళ్లనే పిలిపించుకోటంతో, మాస్కో అంగళ్ళలోనూ హోటళ్ళలోనూ ఝుకోవో వాళ్ళే నిండిపోయారు. ఈవిధంగా మాస్కోమీద ఆధారపడటంవల్ల ఝుకోవోకు గూడెమనేపేరు వచ్చింది. మాట్వోషేవ్ కుటుంబానికి చెందిన ఇవాన్ మాకరిచ్ మాస్కోలోని ఒక రెస్టారెంట్‌లో పనిచేస్తూండేవాడు. అతనే నికోలాయ్‌ని పదాకొండేళ్ళ వయస్సులో మాస్కోకు

తీసుకెళ్ళి, పనిఇప్పించాడు. ఇప్పుడు మాట్వేషేవ్ కుటుంబీకుల్ని చూడగానే నికోలాయ్ ఆర్ద్రితశ్లో పలకరించాడు :

"ఇవాన్ మాకరిచ్ నాకు ఉపకారం చేశాడు. నన్ను సరైన దోవకు తీసుకొచ్చింది ఆయనే కనుక, ఆయన శ్రేయస్సుకొరకు నేను రాత్రిం బగళ్లూ భగవంతుణ్ణి ప్రార్థించి తీరాలి."

ఒక పొడుగాటి ముసలమ్మ మాకరిచ్ సోదరి కంటతడిపెడుతూ ఇలా అంది : "నీకడుపు చల్లగా వర్ధిల్లు తండ్రీ!... కాని మాకరిచ్ ఏమైపోయినాడో వర్తమానమన్నా లేదు."

"గత శీతకాలంలో అతను ఓమన్ హోటల్లో వున్నాడు. ఈ శీతకాలం పట్టణంలో లేడనీ, ఎక్కడో గార్డెన్ రెస్టారెంట్‌లో వున్నాడనీ పుకారు. పాపం, చాలా పెద్దవాడై పోయాడు! వెనుక అతను ఎండా కాలంలో రోజుకు పదిరాళ్ళు కళ్ళజూసేవాడు. ఇప్పుడు ఎక్కడచూచినా నిర్జీవంగానే వుంది. ఏమో పాపం, ఆ వృద్ధుడికి గడ్డు రోజులు!"

ఆ చూడవచ్చిన యువతులూ ముసలమ్మలూ, కాన్వాస్ బూట్లలోవున్న అతని కాళ్ళవంకా, పాలి పోయిన ముఖంవంకా చూచి, విచార సూచకంగా అన్నారు :

"నువ్వేం సంపాదించగలవాడిగా లేవు, నికో లాయ్; నిజంగా నీ తిండి నువ్వు తెచ్చుకో లేవు!"

తర్వాత అంతా శాషాను బుజ్జగించటం మొదలెట్టారు. శాషాకు పదకొండో యేడు నడుస్తున్నది. కాని సన్నగా, గిడసబారి ఏడేళ్ళకంటే లేనట్టు కనిపిస్తుంది ఎండకు మాడిన ముఖాలతో, చింపిరి జుట్టుతో వెలిసిపోయిన గుడ్డలతో వున్న తక్కిన పిల్లలముందు, శాషా తన పాలిపోయిన తెల్లని రంగుతో, విశాలమైన నల్లటి కళ్లతో, తలలో పెట్టుకున్న ఎర్రటి రిబ్బనుతో అద్భుతంగా, అప్పుడే అడివిలోంచి ఇంటికి పట్టుకొచ్చిన ఒక చిన్న వింత జంతువులాగా కనిపించింది.

తన బిడ్డను ఆప్యాయంగా నలుగురికీ చూపుతూ, "దానికి చదవటంకూడా వచ్చు" నని చెప్పి, మోల్గామూలనున్న బైబిల్ తీసి, పిల్లకిచ్చి, "చదువమ్మా చదువు! ఉత్తమ క్రైస్తవజనులు, వీరంతా వింటారు!" అన్నది.

అది చాలా బరువైన పురాతన గ్రంథం. కుక్క చెవుల్లాగా మూలలు వేసిన తోలు బైండు పుస్తకం. ఋషులు ఇంట్లో ప్రవేశించేరేమో అన్నట్టుగా ఒక వింత వాసన కొడుతున్నది. శాషా

కనుబొమలు పైకెత్తి రాగధోరణిలో బిగ్గరగా చదువటం మొదలెట్టింది:

"వారు మరణించినప్పుడు భగవంతుడి యొక్క దివ్యరూపం...జోసెఫ్‌కు కలలో ఇలా ఆదేశిస్తూ కనిపించిందిలే! ఆ పసిపాపనూ వాడి తల్లినీ చేపట్టు" అని.

"పసిపాపనూ వాడి తల్లినీ చేపట్టు" అని వోల్గా పునరుచ్చరిస్తూ, ఆవేశంతో ఉప్పొంగిపోయింది.

బిడ్డ చదువుతున్నది:

"...ఆ పసిపాపనూ వాడి తల్లినీ చేపట్టు! ఈజిప్టుకు పారిపో! ఇక్కడ ఆ పసిపాపను చంపటం కోసం హీరడ్ వెతుకుతుంటాడు. కనుక నేను మళ్లీ కబురంపేదాకా నువ్వు అక్కడే వుండు!"

ఈ మాటలకు ఉండబట్టలేక వోల్గా కన్నీళ్ళు కార్చటం మొదలెట్టింది. ఆమెనుచూసి మార్యా సన్నగా ఏడుపు సాగించింది. మాకర్రిచ్ సోదరి కూడా అదేదారిన పడింది. తన మనమరాలి కెప్పుడన్నా ఓడబ్బు బహుమతి ఇస్తారేమోనన్న ఆశతో ముసలాయన దగ్గుతూ అటూయిటూ తచ్చాడాడు; కాని ఎవ్వరూ ఏమీ ఇవ్వకపోవటం చూసి, నిరాశగా చెయ్యి విదిలించుకుని ఊరుకున్నాడు. బైబిల్ చదవటం పూర్తయినాక, మనస్సులు కరగిపోయి

వోల్గానూ శాషానూ మెచ్చుకుంటూ, అందరూ ఇళ్లకు వెళ్లిపోయారు.

ఆదివారం సెలవుకనక, కుటుంబమంతా పగల్లా ఇంటిదగ్గరే వున్నారు. భర్తా, కోడళ్లూ, మనవళ్లూ, మనమరాళ్లూ అంతా 'నాయనమ్మా' అని పిలిచే ఆ ముసలమ్మ అన్నిపనులూ తానే స్వయంగా చేసుకోవాలని చూస్తుంది. ఆమే స్టవ్ ముట్టిస్తుంది. స్వయంగా తన చేతులతో టీ పాత్ర వేడిచేస్తుంది. పొలాల్లో వుండే మగాళ్లకు తనే మధ్యాహ్న భోజనం మోసుకుపోతుంది. ఇంతాచేసి చివరకు ఈ పనితో నాకు చచ్చేరోజు వచ్చిందని చెప్పటం మొదలుపెడుతుంది. ఎవరన్నా ఎక్కువ తినిపోతారేమోననీ, తన భర్తగానీ కోడళ్ళుగానీ సోమరితనంగా కూర్చుంటారేమోననీ భయంతో ఆమె అనుక్షణం ఆవేదనపడుతుంది. ఆ అంగడివాడి బాతులు తమ దొడ్లోకి వెనకనుంచి వచ్చినట్టు ఆమెకు ఈక్షణం అనిపిస్తుంది. వెంటనే ఓ పెద్ద కర్ర పుచ్చుకుని దొడ్లోకిపోయి, తనలాగే ఎండి వాడి మోటికలాగా వున్న ఆ కాబేజ్ మొక్కల మధ్య కేకలుపెడుతూ ఒక అరగంట ప్రొద్దుపుచ్చుతుంది. అంతలో తన కోడిపిల్లలమీదికి ఓ కాకి వచ్చినట్టు తోచి, పెద్దగా తిట్టుకుంటూ దానిమీదికె

పోతుంది. ఎల్లప్పుడూ కోపం; పొద్దుటినుంచీ ప్రొద్దుకినదాకా ఒకటే దెప్పిపోవటం - తరచూ, వీధిన పొయ్యేవాళ్ళు నిలబడి వినేటంతగా, గందర గోళం చేస్తుంటుంది.

సోమరిపోతనీ, పీడ అనీ తిట్టి ఆమె ముసలా యన్ను చాలా అసహ్యంగా చూసేది. అతను బొత్తిగా ఉపజ్ఞ లేనివాడు. నమ్మరానివాడు కూడా. ఆమె అంతగా పొడుస్తూ వుండకపోతే అసలు పని ఎగేసి, స్టవ్ మీద కూచొని కబుర్లాడుతుండేవాడు. ముసలాయన తన శత్రువుల్ని గురించి కొడుకుకి వివరంగా చెప్పాడు. ప్రతిరోజూ తన ఇరుగుపొరుగు వాళ్ళ చేతుల్లో తాను పడుతూ వచ్చిన కష్టాలు చెప్పుకున్నాడు. అవన్నీ వినటం నికోలాయ్‌కి విసు గ్గానే వుంది కాని, వినక తప్పిందికాదు

తొంటిన చేతులు పెట్టుకొని ముసలాయన మళ్లీ ఆరంభిస్తాడు: "పండగ వెళ్లిన వారానికి బాడి ముప్పై రూపాయల చొప్పున నేను నా యిష్ట పూర్తిగా గడ్డి అమ్మేశాను. సరేగదా, మరి ఆ తర్వాత నా యిష్టపూర్తిగానే పొద్దుట గడ్డి తెచ్చుకుంటున్నాను. నేను ఎవ్వరికీ ఏ అపకారమూ చెయ్యలేదు. ఇంతలో ఒక దౌర్భాగ్యపువేళ అంగ డిలోంచి మునసబు సెడెల్నికోవ్ బయటికి రావటం

చూశాను. 'ఎక్కడికెత్తుకుపోతున్నావ్? వెధవా! వెధవా!' అని మీది మీది కొచ్చి, గూబమీద కొట్టాడు."

కిర్యాక్ కింకా తూలుడు తగ్గక, అన్నకు మొహం చూపటానికి సిగ్గుపడు తున్నాడు.

తిరిగి పోతున్న తల ఊసులాడిస్తూ అన్నాడు: "ఓ భగవంతుడా, వోడ్కా ఎంతపని చేస్తుంది! అన్నా, వదినా – దేవుడి మొహంచూసి నన్ను క్షమించండి, వోడ్కా అంటే నా కేసుఖంగా లేదు."

ఆ రోజు సెలవు కనక చేపకొని, చేపతలతో పులుసు కాచారు. మధ్యాహ్నం టీ త్రాగటానికి కూర్చుని, చెమటలు పట్టిందాకా, అలా త్రాగు తూనే వున్నారు. అంతా టీ తో ఉబ్బిపోయినట్టు న్నారు. ఆ తర్వాత అంతా పులుసుగిన్నెమీద కెగబడ్డారు. అందులోవున్న చేపతల ఎప్పుడో తీసి దాచుకుంది ముసిలమ్మ.

సాయంత్రమప్పుడు ఊరిప్రక్క పల్లంలో ఒక కుమ్మరి ఆవం వేస్తున్నాడు. ఆ క్రింద మైదానంలో ఆడపిల్లలు గుండ్రగా చేరి నృత్యంచేస్తూ, పాటలు పాడుకుంటున్నారు. ఎవరో హార్మోనీ వాయిస్తు న్నారు. నది ఆవలివైపున కూడా ఏదో ఆవం మండు తున్నది. స్త్రీలు పాడుతున్నారు– దూరానికి ఆ సంగీ

తం మృదువుగానూ మనోజ్ఞంగానూ వినిపిస్తున్నది. అంగడి దగ్గరా, ఆ చుట్టుపట్లా రైతులు పెద్ద గందరగోళం చేస్తున్నారు. ఆ తాగిన స్వరాలతో అపశ్రుతులతో పాటలు పాడుతున్నారు. ఒకళ్ళ నొకళ్ళు బూతులు తిట్టుకుంటూ ప్రజ్ఞలు చెప్పు కుంటున్నారు. వోల్గా ఆమాటలు వినలేక, చెవులు మూసుకొని "ఓ పవిత్రమైన ఋషులారా!" అని జపించుకోటం మొదలెట్టింది.

అన్నింటికంటె ఆమెకు ఆశ్చర్యకరమైంది ఏమి టంటే - ఆ ప్రజ్ఞలకు ఒక అంతనేది లేకపోగా, చావుకు సిద్ధమైన వృద్ధులే ముఖ్యంగా మరీ బిగ్గరిగా పట్టుదలగా బూతులు కూయటం పిల్లలూ, స్త్రీలూ కూడా అణుమాత్రం చలించకుండా ఆ బూతులన్నీ వింటున్నారు. ఉగ్గుబాలతోనే ఇవన్నీ వాళ్లకు అల వాటయినా యనేది స్పష్టం.

అర్ధరాత్రి దాటిపోయింది. నదికటూ ఇటూ ఆవాల్లో మంటలారిపోయాయి. కాని ఇంకా ఆ దిగువ మైదానంలోనూ, ఈ అంగడిలోనూ కోలా హలం సాగుతూనేవుంది. ముసలాయనా, కిర్యాకూ- ఇద్దరూ తాగి చెట్టపట్టాలు పట్టుకొని, బుజం బుజం రాచుకుంటూ, వోల్గా మార్యాలు పడుకొనివున్న పాక దగ్గరిదాకా నడిచారు.

అక్కడ ఆ ముసలాయన కొడుక్కు బోధ ప్రారంభించాడు: "పోనీ, దాన్నట్లా ఉండనీలే! అది ఎవరికేం అపకారం చేసింది? దాని జోలికిపోతే, పాపంరా!" అని "మా-ర్యా!" కిర్యాక్ భయంకరంగా కేకవేశాడు.

"దాన్నలా ఉండనీరా! పాపం చుట్టుకుంటుంది. అదేం చెడ్డది కాదురా!"

ఇద్దరూ అలా ఒక నిమిషం నిలబడి వెళ్లిపోయారు.

"నాకు అడివిపూలంటే ప్రాణం! మైదానాల్లో పూలు కోసుకోటం నాకు చాలా ఇష్టం!" అని ముసలాయన పెద్దగా గుండెల్లో గుచ్చుకునే గొంతుతో అరవటం మొదలెట్టాడు.

తర్వాత నేలమీద ఉమ్మేసి. బూతులుకూస్తూ ఇంటికి వెళ్లాడు.

౪

నాయనమ్మ శాషాను దొడ్లో కూచోబెట్టి, బాతులు రాకుండా చూస్తుండమని ఆజ్ఞాపించింది. ఆరోజు ఎండ తీవ్రంగా కాస్తున్నది. అంగడివాడి బాతులు వెనకదోవన దొడ్లో ప్రవేశించే వేళాని,

ఒకదాన్నొకటి ముక్కుల్తో పొడుచుకుంటూ అరుస్తూ అక్కడే అంగడిదగ్గరే అవి ప్రశాంతంగా గింజలేరుకుతింటున్నాయి .అందులో మగబాతు మాత్రమే మెడచాపి, ముసలమ్మ కర్రపట్టుకొని వస్తున్నదేమో చూద్దామన్నట్టుగా చూచి వూరుకుంది. తక్కినబాతులు పల్లంలోంచి పైకి వచ్చేవే కాని, ఎందువల్లనో అన్నీకలసి నది ఆవలికి పోయి, తెల్లటి తోరణంలాగా మైదానమంతటా నిండి, ఆహారం ఏరుకుంటున్నాయి. శాషా కొంతసేపు అలా కనిపెట్టుకూర్చుంది. కాని ఎంతసేపటికీ బాతులు రాకపోయేప్పటికి విసుగెత్తి, ఇక రావు గదా అనుకొని, అటు ఆ మిట్టఅంచు మీదికి పోయి నిలబడింది

అక్కడ మార్యా పెద్దకూతురు మోట్కా చర్చివంక చూస్తూ, ఓ పెద్ద చట్రాతిమీద నిలబడి వుంది. మార్యాకు పదమూడు పురుళ్ళు వెళ్లాయి కాని, ఆరుగురు బిడ్డలుమాత్రమే మిగిలారు. అంతా ఆడపిల్లలు. ఒక్క మగబిడ్డకూడా లేదు. మిగిలిన వాళ్లలో పెద్దది మార్యా ఎనిమిదేళ్లది. మోట్కా పెద్ద గౌను తొడుక్కొని చిసికాళ్లతో ఆ నడి ఎండలో నిలబడివుంది. సూర్యుడు సూటిగా ఆమె నెత్తిన నిప్పులు కురిపిస్తున్నాడు. కాని ఆమె అది

గమనించనే లేదు. రాయిలాగా అలాగే నిలబడి వుంది. శాషా ఆమె ప్రక్కన నుంచొని చర్చివంక చూస్తూ ఇలా అంది :

"దేవుడు చర్చిలో వుంటాడు. మనుషులకు శాల్వాత్తులూ లాంతర్లూ వుంటాయి. కాని దేవుడికి మాత్రం ఆకుపచ్చ ఎరుపు నీలం రంగుల చిన్న చిన్న పవిత్ర జ్యోతులే, ఆలోచనతో నిండిన కన్నుల లాగా, వుంటాయి. రాత్రిపూట దేవుడు చర్చిలో నడుస్తుంటాడు. ఆయనతోపాటు దేవమాత, నికోలాస్ ఋషీ దడదడా నడుస్తుంటారు. ఇదంతా చూసి చర్చి కాపలావాడు ఎంత నిర్ఘాంత పోతాడని! చూడు, చూడు, చెల్లీ," అని శాషా తన తల్లి ధోరణిని అనుసరిస్తూ చెప్పింది: ఈ ప్రపంచానికి ప్రళయం వస్తుందే, అప్పుడు చర్చిలన్నీ స్వర్గానికి ఎగిరిపోతాయి."

"గంటల గోపురాలతో కూడానా?" అని మోటా అక్షరాలు కూడ దీసుకుంటూ గంభీర స్వరంతో ప్రశ్నించింది.

"ఔను. గంటల గోపురాలతో సహా. మరే, ప్రళయం వచ్చినప్పుడు, మంచి వాళ్ళంతా కూడా స్వర్గానికి వెళ్ళిపోతారు. కుటిలాత్ములంతా శాశ్వతంగా ఆరని అగ్నిలో దహించుకు పోతారు. మా

అమ్మకూ మార్యాకూ దేవుడు చెబుతాడు గదా:
'మీ రెన్నడూ ఎవ్వరికీ అపకారం చెయ్యలేదు. కాబట్టి ఇటు కుడివైపుగా స్వర్గానికి వెళ్ళండి!' అంటాడు. కిర్యాక్‌కూ నాయనమ్మకూ ఏం చెబుతాడో తెలుసా? 'మీరు ఎడమవైపు నడవండి! నిప్పుల్లోకి!' అంటాడు. ఉపవాసం చెయ్యవలసిన రోజున అడ్డమైన గడ్డి తిన్నవాళ్ళను కూడా నిప్పులోకే పంపుతాడు."

ఆకాశం వైపుచూసి, కళ్ళు విశాలంగా విప్పుకొని, శాషా మళ్లీ అందుకుంది:

"చూడు చెల్లీ, రెప్పవాల్చకుండా, కళ్లు చికిలించకుండా, ఆకాశంలోకి చూడు! దేవతలు కనపడతారు!"

మోట్కా కూడా అలాగే ఆకాశంలోకి చూస్తున్నది. ఒకక్షణం గడిచింది.

"కన్పించారా?" శాషా అడిగింది.

"నాకు కనిపిస్తున్నారు. చిన్న చిన్న దేవతలు, దోమరెక్కల్లాంటి రెక్కలు తపతపలాడిస్తూ, ఆకాశంలో ఎగిరిపోతున్నారు."

నేల చూస్తూ, మోట్కా కొంచెంసేపు ఆలోచించి, ప్రశ్నించింది:

"నిజంగా నాయనమ్మ మండిపోతుందా?"

"నిజంగానే, చెల్లీ!"

వాళ్లునుంచున్న రాతిమీద నుంచి కింది దాకా వున్న స్లోపు సాఫీగా, పచ్చిక మొలిచి మెత్తగా, ముట్టుకోవాలని గానీ, దానిమీద పడుకోవాలనిగానీ అనిపించేటంత హాయిగా వుంది.

శాషా దానిమీద పడుకొని కిందికి దొర్లింది. మోట్కా కూడా గంభీరమైన మొహంతో భారంగా ఊపిరిపీలుస్తూ, శాషాను అనుసరించింది. కాని దొర్లటంలో మోట్కా గౌను బుజాలదాకా పైకి చుట్టుకు పోయింది.

"ఎంత గమ్మత్తుగావుంది!" అంది శాషా ఆనందంతో.

మళ్లీ దొర్లుదామని ఇద్దరూ పైకెక్కారు. కాని అప్పుడే మామూలు కీచుగొంతు వినిపించింది. ఎంత భయానకం! ఎముకలపోగు, గూనిది, పళ్లులేని నాయనమ్మ— నెరసిన చిర్రబొచ్చు గాలిలో ఎగురుతూ — ఓ పెద్దకర్ర పుచ్చుకొని; కేకలు పెట్టు కుంటూ, దొడ్డోంచి బాతుల్ని తోలుతున్నది.

"పాపిష్టి జంతువులు, కాబేజీ మొక్కలన్నింటినీ తొక్కేశాయి! ఇవింకా చావకుండావున్నాయి. వీటిని ఆ దేవుడు ఎందు కెత్తుకుపోడో!"

తర్వాత ఆమె పిల్లల్ని చూసి, చేతిలో కర్ర అవతల పారేసి ఒక బెత్తం తీసుకొచ్చింది. ఎండి పోయి మేకుల్లాగా గట్టిగా వున్న ఆ వ్రేళ్ళతో శాషా గొంతుపట్టుకుని, బాదటం మొదలుపెట్టింది. శాషా భయంతోనూ బాధతోనూ పెద్దపెట్టున ఏడుస్తున్నది. అంతలోనే, మగబాతు మెడఎత్తు కొని నాయనమ్మ మీదికొచ్చి కస్సుమని వెనక్కి వెళ్ళి గుంపులో కలిసింది. వెంటనే తక్కినవన్నీ దాన్ని అభినందిస్తున్నట్టు "గా-గా-గా" అని అరి చాయి. ఆ తర్వాత నాయనమ్మ మోట్కాను కొట్టటానికి పూనుకుంది. నిస్పృహతో, బిగ్గరగా ఏడ్చుకుంటూ, శాషా ఇంటికి అమ్మకు చెప్పటానికి పోయింది. మోట్కా కూడా శాషా వెంటనే ఏడుస్తూ బయలుదేరింది కాని, మోట్కా ఇంకా కుళ్ళికుళ్ళి ఏడుస్తున్నది, కళ్ళనీళ్ళన్నా తుడుచుకో లేదు. నీళ్ళల్లో మునిగినట్టు మొహమంతా తడిసి పోయివుంది.

ఇద్దరూ ఈవిధంగా ఇంట్లోకి వచ్చేసరికి వోల్గా దిగ్భ్రమ చెంది, "పవిత్రమైన ఋషులారా! ఓ స్వర్గాన్ని పాలించే తల్లీ!" అని ఏడుపు సాగించింది.

శాషా జరిగిన కథ చెప్తుండగా నాయనమ్మ వెర్రికేకలేస్తూ తిట్టుకుంటూ వచ్చింది. ఆమెను

చూడగానే ఫ్యోక్లా మండిపోయింది. ఇంట్లో పెద్ద ఘర్షణ ప్రారంభ మైంది.

బాధతో పాలిపోయిన వోల్గా, కూతురి తల నిమురుతూ, వోదార్చటానికి ప్రయత్నిస్తున్నది: "పోనీలే అమ్మా, మన నాయనమ్మేగదా! ఆమె మీద కోపం వుండకూడదు, పాపం వస్తుంది: తల్లీ!" అని.

నికోలాయ్ అదివరకే ఈ పెడబొబ్బలతోనూ, ఆకలితోను, ఊదర పెట్టినట్టున్న పొగతోనూ, దుర్గంధంతోనూ విసుగెత్తిపోయి; ఈ దుర్భర దారిద్ర్యాన్ని అసహ్యించుకుంటూ, తన తల్లిదండ్రుల్ని చూసి, భార్యదగ్గరా బిడ్డదగ్గరా సిగ్గుతో కుంగి పోతున్నాడు. తల్లిని చూడగానే, స్టవ్ మీదినుంచి కాళ్ళు తీసేసి, ఉద్రేకంగా దుఃఖపూరిత స్వరంతో అన్నాడు:

"నువ్వు దాన్ని కొట్టకూడదు! దాన్ని కొట్టటానికి నీకేమీ అధికారంలేదు!"

"సోమరిపోతువు, స్టవ్ మీద కూచొని శాపనార్థాలు పెట్టటానికి తయారుగా వున్నావు! మిమ్మల్నిక్కడికి ఏ రాక్షసి పట్టుకొచ్చిందో! తిండిపోతురాయుళ్లు!" అంటూ నికోలాయ్ మీదికి విరుచుకుంది ఫ్యోక్లా.

శాషా, మోట్కా, చిన్న పిల్లలంతా భయభ్రాంతులైపోయి, స్టవ్ మీద నికోలాయ్ వెనుక ఒక్క మూలకు నక్కి, భయంతో నిశ్శబ్దంగా ఇదంతా వింటున్నారు. వాళ్ళ గుండెదడ ఎవరికైనా వినిపిస్తుంది. కుటుంబంలో ఎవరైనా చాలా కాలంగా జబ్బుతో తీసుకుంటూవుండి, ఇక లాభం లేదనుకున్నప్పుడు కొన్ని భీభత్స సంఘటనలు కనిపిస్తాయి. అతనికి సన్నిహితులైన పెద్దలంతా బయటకి చెప్పలేని పిరికితనంతో, లోలోపలే రహస్యంగా, తమ హృదంతరాళాల్లో అతని చావు కోరుతుంటారు. పిల్లలకుమాత్రం తమ సన్నిహితుడెవడైనా చచ్చిపోతాడంటేనే భయం! అసలు చావు అనే ఊహ వస్తేనే వాళ్ళు హడిలిపోతారు. ఇప్పుడు ఆ పిల్లలంతా ఊపిరి బిగబట్టి దుఃఖం పొర్లుకొస్తున్న ముఖాలతో నికోలాయ్ వంక చూస్తూ, అతను త్వరలో చనిపోతాడనుకుంటున్నారు. బిగ్గరగా ఏడ్చేసి, అతనికేదన్నా ఇష్టమైంది స్నేహపూర్వకమైందీ చెబుదామా అనిపించింది వాళ్ళకు.

అతను వాళ్గా రక్షణ కోరుతున్నట్టుగా ఆమె దగ్గరకి జరిగి, వణుకుతున్న గొంతుతో నెమ్మదిగా చెబుతున్నాడు:

"ప్రియమైన నాన్నా, ఇంకా ఇక్కడ ఎక్కువ కాలం భరించలేను. నాకా శక్తి లేకపోయె. క్రీస్తు మొహంచూసి, స్వర్గంలోవున్న దేవుడి మొహం చూసి, యీ అక్కయ్యకు ఉత్తరం వ్రాయి. ఏదుంటే అది అమ్మిగానీ ఆర్చిగానీ మనకు డబ్బు పంపించమని వ్రాయి. మనం ఇక్కణ్ణించి వెళ్ళి పోదాం. ఓ భగవంతుడా" అతను బాధతో ఇంకా మాట్లాడుతున్నాడు. "మాస్కో వంక ఒక్కసారి అలా తొంగిచూస్తే! నా తల్లి మాస్కో చూడగలిగితే! అదంతా కల్లో మాత్రమేనేమో!"

సాయంత్రమై, ఇంట్లో చీకటి వ్యాపించాక, ఒక్కమాటకూడా పెగలనంత భయంకరమై పోయింది. నాయనమ్మ ఎప్పటిమాదిరిగానే మండి పోతున్నది. నాన పెట్టిన రొట్టె పెంకులు చీకుతూ గంటసేపుకూచుంది. మార్యా గిన్నెనిండా పాలుతీసు కొచ్చి బల్లమీద పెట్టింది. నాయనమ్మ వచ్చి నిదానంగా నిర్భీతిగా పాలు కూజాల్లోపోస్తూ, ఇవాళ, మేరీకన్య స్వర్గారోహణానికి ముందు, అందరూ ఉప వాసం గనుక పాలుఎవ్వరూ ముట్టుకోరుగదా అనీ, అన్నీ అలాగే మిగులుతాయిగదా అని సంతోషిం చింది. ఫ్యోక్లా బిడ్డకోసం మాత్రం కొద్దిగా సాసర్లో పోసింది. నాయనమ్మా, మార్యా కూజాలు కింది

గదిలో పెట్టి రావటానికి వెళ్లినప్పుడు, మోట్కాకు హఠాత్తుగా ప్రాణంలేచి వచ్చింది. స్టవ్ మీదినుంచి దిగి, బల్లదగ్గిరికిపోయి, రొట్టెపెంకులు పెట్టినకొయ్య గిన్నెలో సాసర్లోంచి పాలుపోసి వచ్చి, మళ్లీ స్టవ్ మీదికెక్కి కూచుంది.

నాయనమ్మ తిరిగి వచ్చి తను నానపెట్టుకున్న రొట్టెలు నమలటం ప్రారంభించింది. శాషా మోట్కాలు స్టవ్ మీదకూచొని చూస్తున్నారు. ఉపవాసం నాడు తిండి తిన్నందువల్ల ఆమె నరకానికి పోతుందిగదా అని సంతోషిస్తున్నారు. ఇది వాళ్లకు హాయిగా అనిపించి, నిద్రపోదామని పడుకున్నారు. కన్నుకునుకక ముందు శాషా తుదితీర్పు మననం చేసుకుంటున్నది: కుమ్మరివాడి ఆవంలో లాగా స్టవ్‌లో ఏదో మండుతున్నది. ఎద్దుకొమ్ముల్లాంటి కొమ్ములతో, నల్లటి శరీరంతో యమకింకరుడు చేతిలో ఒకపెద్ద కర్రపుచ్చుకుని, నాయనమ్మ బాతుల్ని తోలినట్టుగా, నాయనమ్మను మంటల్లోకి తోలుకొస్తున్నాడు.

౫

స్వర్గారోహణ మహోత్సవంలో, రాత్రిపూట క్రింది మైదానంలో ఆటలతో పాటలతో ఉల్లాస

పడుతున్న స్త్రీలు, పదిగంటలు దాటాక హఠాత్తుగా కేకలుపెడుతూ, అరుస్తూ, ఊరివైపుపరుగెత్తుకొస్తున్నారు దిగుడు ఎగువన మిట్టమీద కూర్చున్న వాళ్లకు అసలు సంగతేమిటో మొదట్లో అర్థం కాలేదు.

"మంట ! మంట ! ఊరుముట్టుకుంది !" అని చావుతెంపుతో వేస్తున్న కేకలు కిందినించి వినిపిస్తున్నాయి.

మిట్టమీద కూచొని మైదానంవంక చూస్తున్న వాళ్ళు, ఒక్కసారిగా వెనుదిరిగి చూసేసరికి, వూరంతా మంటల్లో భయంకరంగా కనిపించింది. ఊరి చివర ఒక పూరి కొంపలోంచి ఏడడుగుల ఎత్తున మంటలేచి, సుడితిరిగి, జలయంత్రంలాగా చుట్టూ నిప్పులు విరజిమ్ముతున్నది. అంతలోనే, ఆ యింటి కప్పు అంతా ఉజ్జ్వలజ్వాలగా మారిపోయి, చిటచిటా మండిపోతున్నది.

ఈ కాంతికి వెన్నెల మసకేసింది. ఊరంతటా వణకుతున్న ఎర్రటి వెలుగు వ్యాపించింది. నేల మీద నల్లటి నీడలు కదలాడుతున్నాయి. మంట వాసన తగులుతున్నది. మైదానంలోంచి పైకి పరుగెత్తుకొచ్చినవాళ్ళు మాట్లాడజాలనంత, ఎగశ్వాస దిగశ్వాసగా క్షంపించి పోతున్నారు. ఒకర్నొకరు

త్రోసుకొని, కింద పడిపోతున్నారు. అంత తీవ్ర కాంతికి ఎన్నడూ అలవడివుండక పోవటాన, ఆ కాంతిలో ఒకరినొకరు చూసి గుర్తించుకోలేక పోతున్నారు. అదంతా భీతావహంగా వుంది. మంటలమీదిగా పొగలోంచి పావురాలు ఎగిరిపోవ టమూ, అంగడిలో ఇంకా మంటలుసంగతి తెలేని వాళ్ళు ఏమీ జరగనట్టుగానే హార్మనీ వాయించు కుంటూ పాడుకుంటూ వుండటమూ – మరీ భీభత్స మనిపిస్తుంది.

"సెమ్యాన్ మామయిల్లు అంటుకుంది!" అని ఎవరో బిగ్గరగా కఠోరంగా కేక వేశాడు.

మార్యా పళ్ళు పటపటలాడిస్తూ, చేతులు తిప్పుకుంటూ, ఏడుస్తూ తన యింటివైపు పరుగెత్తు తున్నది. కాని ఇంకా మంటలు ఊరి కొచివర, చాలా దూరంగానే వున్నాయి. కేన్వాస్ బూట్లు తొడుక్కొని నికోలామ్ ఇంట్లోనించి బయటికి వచ్చాడు. చిన్నగౌను తొడుక్కున్న పిల్లలంతా ఏమీతోచక అటూఇటూ తచ్చాడుతున్నారు. గ్రామంలోని పోలీసు ఇంటిదగ్గర 'బూం-బూం' అని గంటమోగుతున్నది. ఆ నిరంతర ధ్వని గుండెల్లో గుచ్చుకుని, మనుష్యుల్ని స్తంభింపజేసేటంత భయా నకంగా, గాలిలో తేలిపోతున్నది. దైవ విగ్రహాలు

పట్టుకొని ముసలమ్మలు అక్కడక్కడా నిలబడి వున్నారు. గొర్రెల్నీ, ఆవుల్నీ, దూడల్నీ దొడ్ల లోంచి వదిలేసి, వీధిలోకి తోలారు. పెట్టే, బేడా ...సాధ్యమైనవన్నీ ఇళ్లల్లోంచి బైటికి చేరవేస్తు న్నారు. తక్కిన గుర్రాలన్నిటినీ తన్నికరచినందుకు వేరుగావుంచబడిన నల్లగుర్రాన్నికూడా వదిలేశారు. సకిలిస్తూ, నేలమీద కాలుదువ్వుతూ, అది అప్పుడే ఒకటి రెండుసార్లు వీధి ఆచివరినించి ఈ చివరకు పరుగెత్తివచ్చి, ఒక బండి దగ్గర నిలబడి దాన్ని వెనక కాళ్ళతో తన్నటం మొదలెట్టింది.

నదికవతల చర్చిగంటలు కొట్టుకుంటున్నాయి.

మండుతున్న ఇంటిదగ్గిర అమితమైన వేడిగా వుంది. ఆ వెలుతురులో నేలమీది ప్రతి గడ్డిపోచా స్పష్టంగా కనపడుతోన్నది: సెమ్యాన్ ఇంట్లోంచి బైటికి చేరేసిన పెట్టెల్లో ఒకదానిమీద సెమ్యాన్ చొక్కా తొడుక్కొని టోపీ చెవుల మీదికి పడుతూ, పొడుగాటి ముక్కుతో కూర్చొని వున్నాడు. అతని భార్య మొహం నేలకుపెట్టి స్పృహ లేకుండా, నేలమీద పడి ఏడుస్తున్నది. పెద్ద గడ్డం గల ఒక ఎనభై ఏళ్ల వృద్ధుడు, వామనమూర్తి లాగా చేతిలో ఒక తెల్లటి మూటపట్టుకొని అక్కడ అటూ ఇటూ బోడితలతో తిరుగుతున్నాడు. అతను

ఊరికి కొత్తవాడే కాని, ఇందులో అతనికేదో ప్రమేయం వుండివుంటుంది. ఆ బట్టతలమీద మంటలు ప్రతిబింబిస్తున్నాయి. అనాది జాతివాడి లాగా నల్లగా నల్లటి వెంట్రుకలతో వున్న, గ్రామ మునసబు సెడెల్నికోవ్ గొడ్డలి తీసుకొని ఆ మండు తున్న ఇంటి దగ్గరకెళ్లి, కిటికీలన్నీ ఒక్క టొక్కటే నరికేసాడు. తర్వాతావసారా నరకటం ప్రారంభిం చాడు.

"ఆడవాళ్ళు నీళ్ళు పట్టుకురండి! ఇంజన్ తీసుకురండి! కదలండి!" అని సెడెల్నికోవ్ కేకలేశాడు.

అప్పటిదాకా, అంగడిలో ఉల్లాసపడుతున్న రైతులు, ఇంజన్ లాక్కొస్తున్నారు. అంతా తాగి వున్నారు తూలుతూ పడిపోతున్నారు. అందరి కళ్ల ల్లోనూ కన్నీళ్లూ, నిస్సహాయతా తొంగిచూస్తు న్నాయి.

"ఆడవాళ్ళు నీళ్ళు తీసుకురండి! కదలండి! కదలండి!" అని తాగివున్న మునసబు మళ్లీ అరి చాడు.

స్త్రీలూ పిల్లలూ కడవలు తీసుకొని, కొండ కింది ఊటబావికి పరుగెత్తి, నీళ్ళు తెచ్చి, ఇంజన్లో పోసి, మళ్లీ కిందికి పరుగెత్తారు. వోల్గా, మార్యా, శాషా, మోట్యా — అంతా నీళ్ళు మోస్తున్నారు.

కొందరు స్త్రీలూ మగపిల్లలూ కలిసి, ఇంజనునించి నీళ్ళు పైకి కొడుతున్నారు. ఈ నీటిజల్లుకు 'ఇస్' మంటూ, ఆమండే ఇల్లు ఆవిర్లు క్రక్కుతున్నది. తలుపువంక, కిటికీలవంక, ఎట్లు నీళ్ళు కొట్టాలో చూపుతూ, ఆపవలసినప్పుడు గొట్టంచివర వ్రేలు పెట్టి, ధారను ఆపుతూ, మునసబు సెడిల్నికోవ్ మంటల్ని ఆర్పేందుకు దారి చూపుతున్నాడు.

"సెడిల్నికోవ్ మొనగాడు! కొట్టండి! నీళ్ళు కొట్టండి!" అని జనంలోంచి అంగీకార సూచకంగా కేకలు వినిపిస్తున్నాయి.

సెడిల్నికోవ్ మండుతున్న యింట్లోకి దూకి, లోపలినుంచి కేకలు పెడుతున్నాడు :

"నీళ్ళు కొట్టండి! యిలాంటి భయంకర సంఘటనలో కాస్త చెయ్యాసరా యివ్వండి!"

రైతులు నిశ్చేష్టులై మంటవంక చూస్తూ, చుట్టూ గుంపుకట్టి నిలబడ్డారు. ఏం చెయ్యాలో యెవరికి తెలియదు. ఏం చెయ్యాలన్నా తోచదు. చుట్టూతా గడ్డివాములూ, పాకలూ! కిర్యాక్, అతని తండ్రి ఆసిఫ్ - యిద్దరూకూడా, తాగిన మైకంతో, అక్కడే నిలబడివున్నారు తన సోమరితనాన్ని సమర్థించుకోటానికన్నట్టుగా, క్రిందపడి ఏడుస్తున్న ఆవిడతో ఆసిఫ్ అన్నాడు :

"ఎందుకమ్మా, అలా ఇదవుతావు! యిల్లు భీమా చేశారుగదా-యింకా బాధ దేనికి?"

సెమ్యాన్, ఒకరిని విడిస్తే ఒకరికి, అసలు నిప్పు ఎలా అంటుకుందో చెబుతూనే వున్నాడు.

"ఆ తెల్లటి మూటవేసుకు తిరుగుతున్నాడే ముసలివాడు-వాడు జెనరల్ ఝుకోవ్ ఇంట్లో పని చేస్తాడు. మా జెనరల్ గారి వంటవాడు. వాడి ఆత్మకు శాంతి కలగాలి, పాపం! అతను ఈ సాయంత్రమే వచ్చి, 'ఈ రాత్రికి యిక్కడ వుండనివ్వండి! అని అడిగాడు. పోనీ గదా, ఏదో కల్లోగంజో తలా కాస్తా, అలాగే వుండమన్నాం. నా భార్య టీ కాచి, టీ గిన్నె యివతల పెట్టింది. అంతలో పొయిలోంచి రవ్వలు లేచి సూటిగా నడికొప్పు అంటుకుంది. మేము ఆయింటో సగం కాలిపోయి నట్లయింది. పాపం, ఆ ముసలాడి టోపీ మండి పోయిందికూడా. నిజంగా సిగ్గుచేటు.

పోలీసు యింటిదగ్గర గంట యింకా "బూం-బూం" అని యింకా మ్రోగుతూనే వుంది; చర్చి గంటలు యింకా కొట్టుకుంటూనే వున్నాయి. ఆ కాంతిలో మొహమంతా కెంపెక్కి, ఊపిరిలేకుండా, వోల్గా, ఆ పోతున్న ఎర్రటి గొర్రెలనూ, పైన పొగలో ఎగురుతున్న నిప్పు కణికల్లాంటి పావురా

లనూ భయానకంగా చూస్తూ, ఆ స్లోపులో క్రిందికీ పైకీ నీళ్లు మోస్తూ పరుగెత్తుతున్నది. ఆ గంట్ల మోత – తన హృదయంలో కంటకప్రాయంగా గుచ్చుకున్నట్టూ, ఈ మంటలు ఎప్పటికీ ఆరిపో వన్నట్టూ, శాపా బ్రతుకు పూర్తిఅయిపోయినట్టూ – ఆమెకేదో లోలోపల అనిపిస్తున్నది. ఆ యింటి కప్పు మండిపోతూ ఒక్కసారి ఫెళఫెళా విరుచుకు క్రిందపడిపోయినప్పుడు, ఇక ఊరంతా తగలబడి తీరు తుందనే ఆలోచన వచ్చి, ఆమె స్తంభించిపోయింది. మరి నీళ్ళు మోయలేకపోయింది. బొక్కెనలు ప్రక్కన పెట్టుకొని, ఆ స్లోప్ అంచుమీద అలా కూలబడింది. ఆమెకు దిగువనా చుట్టూ – స్త్రీ లంతా, శవం దగ్గిరలాగా, ఏడుస్తూ కూర్చున్నారు.

అప్పుడు, నది అవతలివొడ్డునుంచి, రెండు బళ్ళ మీద ఫైర్ – ఇంజన్ తీసుకొని కొంతమంది మను షులు వచ్చారు. చొక్కాకు బొత్తాములు లేని ఒక విద్యార్థి యువకుడు గుర్రంమీద వచ్చాడు. ముందు, గొడ్డల్లాడిన మోత వినిపించింది. తర్వాత, మండుతున్న ఇంటి గోడకు నిచ్చెనవేసి, ఐదుగురు మనుష్యులు గబగబా పైకెక్కిపోయారు. ఎర్రబా రిన మొగంతో ఒక విద్యార్థి, మంటలార్పటంలో ఆరితేరిన వాడి ధోరణిలో గంభీరంగా గట్టిగా ఉత్త

రువు లిస్తూ వాళ్ళను నడుపుతున్నాడు. తడవకొక దూలం చొప్పున వాళ్ళు ఇంటికప్పంతా ఒక్క క్షణంలో కూల్చిపారేశారు. గుర్రాల పాకనూ, ఇంటి దడినీ దూరంగా లాగిపారేసి, ఆ దగ్గిరలోవున్న గడ్డి వామినికూడా దూరానికి తరలించారు.

"వాళ్లు వస్తువులు నాశనం చెయ్యకుండా చూడండి!" అని జనంలోంచి ఎవరో అరుస్తున్నారు.

ఈ కొత్త వాళ్ళు పనిముట్లు పాడుచెయ్యకుండా కాపాడటానికన్నట్టుగా, కిర్యాక్ దృఢ సంకల్పంతో ఇంటి దగ్గిరి కెళ్లాడు. కాని, అందులో ఒకడు కిర్యాక్‌ను మెడమీద కొట్టి, వెనక్కు నెట్టేశాడు. జనం ఒక్కసారి గొల్లున నవ్వారు. ఆ కొత్తవాడు కిర్యాక్‌ను మళ్లీ కొట్టటంతో, అతను కిందపడిపోయి, కాళ్ళా చేతులా ప్రాకుతూ జనంలో వచ్చి పడ్డాడు.

టోపీలు పెట్టుకున్న ఇద్దరు చక్కని యువతులు బహుశః ఆ విద్యార్థి చెల్లెళ్లు గాబోలు, నది అవతలినుంచి వచ్చారు. మంటవంక చూస్తూ, వాళ్ళు దూరంగా నిలబడ్డారు. మంటల్లోంచి కూల్చివేసిన దూలాలు మండటం మానేసి, పొగలు గ్రక్కుతున్నాయి. నీటిగొట్టం పట్టుకొని మంటలమీదికి నీళ్ళు చిమ్ముతున్న విద్యార్థి, ముందు ఆ ప్రవా

హాన్ని దూలాలవైపు త్రిప్పాడు. అవి ఆరిపోయాక నీళ్ళుకొడుతున్న రైతులమీదికీ, స్త్రీలమీదికీ త్రిప్పాడు.

"జార్జెస్! జార్జెస్!" అని ఆ యిద్దరూ యువతులూ అతన్ని ఆదుర్దాగా మందలించారు.

మంటలారిపోయాయి. అంతా ఇళ్లకు మరలిపోతున్నారు.

అప్పటిదాకా తూరుపురేకలు తెల్లవారుతున్నాయనిగానీ, అందరి మొహాలూ నల్లబడి శరీరాలు తెలుపెక్కాయనిగానీ - ఎవ్వరికీ తెలీనే తెలీదు. అసలు మామూలుగా తుదిచుక్కలు క్రుంకేటప్పుడు అందరూ అలాగేవుంటారు. గుంపులు చెదిరిపోతూ, జెనరల్ ఝుకోవ్ వంటవాణ్ణి గురించీ, వాడి కాలిపోయిన టోపీని గురించీ హాస్యాలాడుకుంటూ నవ్వుకుంటున్నారు. వాళ్లు అప్పుడే ఈఅగ్నిప్రమాదాన్ని అపహాస్యం క్రిందికి దించే ధోరణిలో పడ్డారు. అంతేకాక, అప్పుడే ఆరిపోయిందేమా అని విచారపడుతున్నట్టుకూడా కనిపిస్తున్నారు.

"మీరు మంటలార్పటంలో సమర్థులు! మీరు మాస్కోలో వుండవలసింది: అక్కడ ప్రతిరోజూ మాకు ఏదో ఒక అగ్నిప్రమాదం వుండనేవుంటుంది." అంది విద్యార్థిని వోల్గా.

ప ల్లె ప ట్టు

"మీరు మాస్కో-నుంచి ఎందుకొచ్చారు?" అని అడిగింది ఆయువతుల్లో ఒకామె.

"ఔనమ్మా; వచ్చాం. నాభర్తకు స్లావ్యాన్స్కీ-న బజారులోపని." అని చెప్పి, చలిలో తనకు కరుచుకు పోయిన శాషాను చూపుతూ చెప్పింది: ఇది నా కూతురు. ఇదికూడా మాస్కో-లోనే పుట్టి పెరి గింది."

ఆయువతులిద్దరూ విద్యార్థికి ఫ్రెంచిభాషలో ఏమో చెప్పారు. తర్వాత అతను ఒక పావలా తీసి శాషా చేతులో పెట్టాడు.

ఇది చూసే సరికి ముసలి ఆసిఫ్ మొహాన ఒక ఆశాకిరణం మెరిసింది.

"ఇంత వేగం ఆరిపోయినందుకు మనం ముఖ్యంగా దేవుణ్ణి అభినందించాలి. గాలి అంత తీవ్రంగా లేదుగాని, అయ్యా, లేకపోతే మేమందరం కూడా ఎప్పుడో దగ్ధమై పోయేవాళ్ళం. అంతా మీదయ...దయగల ప్రభువులు..." అని విద్యార్థిని అభినందిస్తూ ఆసిఫ్, అంతలో డబ్బుతిత్తిక పెట్టి అడిగాడు: "ఉదయం ఎంత చల్లగావుంది ..కాస్త వెచ్చదనం కోసం ఏదన్నా... మీపేరు చెప్పుకొని ప్రభువుల ఆరోగ్యం కోసం ఒక అరబుడ్డి..."

కాని, విద్యార్థి అతని కేమీ ఇవ్వ లేదు. తర్వాత వృద్ధుడు గొంతు సవరించుకుంటూ, ఇంటి ముఖం పట్టాడు. వోల్గా స్లోపు అంచున నించొని నదిదాటి పోతున్న రెండుబళ్లనూ, మైదానంలో నడుస్తున్న ఆ పెద్దమనుష్యులనూ చూస్తున్నది. వాళ్ల కోసం నది అవతల వేరే ఒక బండి కనిపెట్టుకుని వుంది. అటు తర్వాత వోల్గా భర్త దగ్గరికి పోయి ఉత్సాహంతో చెప్పటం ప్రారంభించింది :

"ఎంత మంచివాళ్లని ! చక్కని వాళ్ళుకూడా ! ఆయువతులు నిజంగా దేవతల్లాగా వున్నారు !"

"వాళ్ళ మొహాలు మండిపోను !" అన్నది నిద్రమత్తుతో, పట్టరాని ద్వేషం కక్కుతూ ఫ్యోక్లా.

## ౬

జీవితమే దుర్భరంగా అనిపించి, మార్యా, చచ్చిపోవాలని తరచుగా కోరుకునేది. ఫ్యోక్లా మనస్తత్వం ఇందుకు పూర్తిగా విరుద్ధమైంది. ఆమెకు ఈ జీవితంలో ప్రతిదీ – ఈ దరిద్రం, ఈ మురికీ, ఈ ఎడా తెరిపీలేని తిట్లూ – అన్నీ ఇష్టంగానే వుండేవి. ఇంట్లో ఏదిపెడితే అది తిని, ఎక్కడపడితే అక్కడ, చేతికేదిచిక్కితే దానిమీద పడుకొని నిద్రపోయేది.

ఇంట్లోంచి మురికినీళ్ళు తెచ్చి, గడపలోనుంచి వసారాలోకి దిమ్మరించి, మళ్ళీ ఆ బురదలోంచే దిసికాళ్ళతో నడిచి పోతుండేది. వోల్గా, నికోలాయ్‌లను చూసిననాటినుంచే వాళ్ళను ద్వేషించటం మొదలు పెట్టింది. వాళ్ళు ఈ జీవితానికి అనుగుణంగా లేకపోవటమే అందుకు కారణం.

"మాస్కో పెద్దమనుషులు! ఇక్కడ ఏమాత్రం తింటారో చూస్తానుగదా! చూస్తాను!" అని ఎక్కడ లేని కావేషం తెచ్చుకుని అనేది.

సెప్టెంబరు మొదట్లో, ఒకనాటి ఉదయం ఫ్రాక్లా కావిడేసుకొని దిగువ మైదానంలోని బావికెళ్ళి రెండు కుండలనిండా నీళ్ళుపట్టుకొచ్చింది. ఆ చలిలో ఆమె గులాబీరంగులో, చక్కగా, బలిష్ఠంగా వుంది. అప్పటికి మార్యా వోల్గాలు టేబిల్ దగ్గర కూర్చొని టీ తాగుతున్నారు.

"మీకేం, టీ తాగండి!" అని ఎత్తిపోదుస్తూ కుండలు క్రిందికి దించి, "దొరసానులు! వాళ్ళకు ప్రతిరోజూ టీ తాగటం అలవాటైంది. టీ తాగి, తాగి మీకడుపులుబ్బిపోకుండా చూసుకోండమ్మా!" అని వోల్గావంక ద్వేషంతో చూస్తూ, దానికేం, మాస్కోలో తెగబలిసి వచ్చింది. అంతా పంది కొవ్వు!" అంది.

కొవడిబద్ద విసరి, వోల్గా బుజానికి తగిలేట్టు కొట్టింది. అత్తాకోడళ్ళిద్దరూ పవిత్రమైన ఋషుల్ని తలచుకోటం తప్పితే, మరేమీ చెయ్యలేక పోయారు.

తరువాత ఇంట్లోకి వినపడేటంత బిగ్గరగా తిట్టుకుంటూ ఫ్యోక్లాగుడ్డ లుతుక్కుంటానికి నది దగ్గరకెళ్ళింది.

పగలు గడచిపోయింది. ఆ చలికాలపు సాయంత్రం ఎంతకీ గడవకుండా దీర్ఘంగా వుంది. ఇంట్లో మార్యా, వోల్గాలు సిల్కుదారం తీస్తున్నారు. ఫ్యోక్లామాత్రం నదిదాటి, అవతలికి వెళ్ళిపోయింది. ప్రక్కనున్న ఫ్యాక్టరీనుంచి సిల్కు తెచ్చుకుని ఇంటిల్లిపాదీ పనిచేస్తారు. కాని వచ్చే ఆదాయంమాత్రం అల్పమే - వారానికో రూపాయి డబ్బులు వస్తాయి.

"యజమానుల కింద పనిచెయ్యటం ఎప్పటికీ సుఖమే. పనీ, తిండీ, నిద్రా - ఒక క్రమంలో అమిరేవి. ప్రతిరోజూ రెండు పూటలా పులుసూ పచ్చడీ వుంటాయి. కడుపు పట్టినంత తినొచ్చు. అంతేకాక, జీవితం ఇంకా ఖచ్చితంగా వుంటుంది కూడా. ఎవడి స్థానం ఏమిటో వాడికి తెలుస్తుంది." అన్నాడు దారం తీస్తూ, వృద్ధుడు ఆసిప్.

ప్రొద్దుగూకింది. ఇంట్లో ఒక్కటే దీపం. పొగ చూరి గుడ్డి వెలుతురిస్తున్నది. ఎవరన్నా దీపానికి అడ్డం నిలబడి, పెద్ద నీడ కిటికీమీద పడ్డప్పుడు కిటికీలోంచి లోపలికివచ్చే వెన్నెల స్పష్టముగా కనపడుతున్నది. బానిసత్వంనుంచి విముక్తి పొందక పూర్వం ఈ ప్రాంతంలో ప్రజలెలా జీవించేవారో ముసలి ఆసిఫ్ చెబుతున్నాడు. ఇప్పుడు దరిద్రంతో యింతభయంకరంగా వున్న జీవితం అప్పుడెలావుండేదో, రేచుకుక్కలనూ, వేటకుక్కలనూ తీసుకొని గుర్రాలమీద ఎలా వేటకు వెళ్ళేవారో, చిన్న చిన్న పనుల్లో కుదిరిన రైతులకుకూడా ఎలా వోడ్కా దొరికేదో, వేటలో దొరికిన పక్షుల్ని మాస్కో . యజమానులకోసం ఎలా బళ్ళమీద తోలేవారో, బానిసల్లో చెడ్డవారిని కర్రలతో బాది, టీవర్ ఎస్టేట్‌కు ఎలా పంపేవారో, మంచివాళ్ళకు ఎలా బహుమతు లిచ్చేవారో అన్నీ చెప్పుకొచ్చాడు ముసలమ్మకు కూడాని చెప్పటానికేదో వుంది. ఆమెకు ప్రతి విషయమూ పూర్తిగా జ్ఞాపకమే. ఆమె తన యజమానురాలిని గురించి చెబుతున్నది. ఆమె మంచిది. దైవభీతి కలది. ఆమె భర్త తాగుబోతు, పట్టి తిరుగుబోతుకూడా. ఆమె కూతుళ్ళందరూ

అలాంటి పాపిష్ఠి పెళ్ళిళ్లే చేసుకున్నారు. ఒకావిడ ఒక తాగుబోతును, మరొకావిడ ఒక మామూలు మనిషినీ, పెళ్లి చేసుకున్నారు. మూడో ఆవిడ ఎవడి తోనో లేచిపోయింది. (అప్పటికి మన ముసలమ్మ వయసులోనే వుంది. ఆ అమ్మాయి లేచిపోవడానికి తోడ్పడిందికూడా.) చివరకు వాళ్ళు ముగ్గురూ దుఃఖంతో త్వరలోనే చనిపోయారు. వాళ్ల తల్లి కూడా అదేపని చేసింది. యిదంతా దృష్టికి తెచ్చు కుని ముసలమ్మ కంటనీరు పెట్టింది

ఇంతలో హఠాత్తుగా ఎవరో తలుపు తట్ట టంతో, అంతా ఒకసారి కదిలారు.

"ఆసిప్ మామా! నన్ని రాత్రికి ఇక్కడ ఉండనివ్వు!" అంటూ ఆ బట్టతల వృద్ధుడు, జన రల్ ఝుకోవ్ వంటమనిషి, నిన్నటిమంటల్లో టోపీ కాలిపోయినవాడే, లోపలికి ప్రవేశించాడు. అతను కూడా, వాళ్ళ సంభాషణ వింటూ, కూర్చున్నాడు. తర్వాత అతనుకూడా గుర్తుకు తెచ్చుకొని కథలు చెప్పటం ప్రారంభించాడు. నికోలాయ్ స్టవ్ మీద కూర్చొని కాళ్ళు క్రింద వేలాడేసుకుని, అన్నీ వింటూ, ఆ రోజుల్లో పెద్దమనుషుల వవ్వంటకాలు ఎలా తయారుచేసేవారో అడిగి తెలుసుకుంటున్నాడు చాప్సను గురించీ, కట్‌లెట్సను గురించీ, రకరకాల

పులుసును గురించీ, కూరలను గురించీ వాళ్ళు చెప్పు కున్నారు. ఇప్పుడు ఆచారంలో లేని పూర్వకాలపు కూరలూ పిండివంటలూ వారికి బాగా జ్ఞాపకం. పేరుపేరా ప్రతిదీ వర్ణిస్తున్నారు. మాట వరసకు — ఎద్దు కళ్ళతో తయారుచేసే 'పొద్దుటిమేల్కొలుపు' అనేదే వుందనుకోండి.

"ఇప్పటి మోస్తరు కట్‌లెట్స్ చేసేవారా మీరు ?" నికోలాయ్ అడిగాడు.

"లేదు."

"ఓహో ! భలేవంటవాళ్ళు !" అన్నాడు నిరసనగా నికోలాయ్.

చిన్నపిల్లలు స్టవ్ మీద కూర్చొనీ పడుకొనీ రెప్పవాల్చకుండా కథలు చెప్పేవాళ్ళవంక చూస్తు న్నారు. మేఘాల్లో దేవతల్లాగా, ఆ స్టవ్ మీద, పిల్లలు చాలామంది వున్నట్టున్నారు. వాళ్ళకు కథ లంటే ఇష్టం. ఆయా సన్నివేశాల్లో నిట్టూరుస్తూ, నిర్ఘాంతపోతూ, వెలవెలపోతూ వాళ్ళ కథలు వింటు న్నారు. మరీ నాయనమ్మ చెప్పే కథలు బాగు న్నాయి. ఆమె చెబుతున్నంతసేపూ ఊపిరైనా తీసు కోకుండా, కదలితే ఏమాటపోతుందో అన్నంత భయంతో, శ్రద్ధగా విన్నారు.

కథలైనాక పిల్లలు నిశ్శబ్దంగా నిద్రకొరిగారు. పెద్దవాళ్ళు తమ పాతజ్ఞాపకాలన్నీ పైకి వచ్చి, సంచలిస్తూ, 'యౌవనంలో వుండటం ఎంత అదృష్టం' అనుకుంటున్నారు. యౌవనం ఎట్లాంటిదైనప్పటికీ, ఆ ఉల్లాసం, ఆ ఆనందం, ఆ ఆర్ద్రితా తప్పితే వాళ్లకు మరేమీ జ్ఞాపకం లేదు. ఇక చావును గురించి ఆలోచించారు. ఎక్కువ దూరంలో లేని ఈమృత్యువు ఎంత భయంకరమైంది. దీన్ని గురించి తలచుకోకపోవటమే మంచిది! ఇంతలో ఆ గుడ్డి దీపం కొండెక్కింది. ఇంట్లో చీకటీ, వెన్నెట్లో మెరుస్తున్న రెండు కిటికీలూ, ఆ నిశ్శబ్దం, కిర్రుమంటున్న ఉయ్యాల – అన్నీ కలిసి ఎందువల్లనో వాళ్ల ఆలోచనలన్నిటినీ ఆపివేశాయి. తమ జీవితాలు ముగిశాయనీ, ఇక వాటిని మళ్లీ పొందటం సాధ్యం కాదనీ మాత్రమే అనుకుని పడుకున్నారు.

మనం కళ్ళు మూసుకొని, మైకంలో పడిపోతామనుకో. అంతలో హఠాత్తుగా ఎవరో వచ్చి బుజంతట్టి నట్లవుతుంది. వాడి శ్వాస మనదవడ మీద తగులుతున్నట్లుంటుంది. వెంటనే నిద్రంతా పోయి, రక్తప్రసారం ఆగినట్లుగా శరీరమంతా కొయ్యబారుతుంది. మృత్యువును గూర్చిన ఆలోచనలు మనస్సు నిండా అలముకుంటాయి. తర్వాత

అదంతా వట్టిదే అని తెలుసుకొని, రెండో వైపుకు తిరిగి పడుకుంటాము. అప్పుడు చావుమాట మరచి పోతాము. కాని, ఆకలీ, తిండీ, ధరల పెరుగుదల మొదలైన అనేక అల్పవిషయాలు మనస్సు నిండా పరుగెడుతుంటాయి. అంతలో మళ్లీ జ్ఞాపకం వస్తుంది – మనజీవితం ముగిసిందనీ, తిరిగి తెచ్చుకునే దారి లేదనీ...

"ఓ భగవంతుడా!" అని నిట్టూర్చాడు ముసలి వంటవాడు.

ఎవరో నెమ్మదిగా, చాలా నెమ్మదిగా కిటికీ తట్టారు. ఫ్యోదోరే తిరిగి వచ్చినట్టుంది. ఓల్గా నిద్రలేచి, ఆవులిస్తూ లోలోపల ఏదో దైవప్రార్థన చదువుకుంటూ వచ్చి తలుపు తాళంతీసి గడియ తీసింది. కాని ఎవ్వరూ లోపలికి రాలేదు. గాలి విసురుకు తలుపు అలా కొట్టుకొని వుంటుందనిపించింది. అకస్మాత్తుగా మేఘాలు తొలిగి, చంద్రకాంతి గడపలో స్పష్టంగా ప్రకాశిస్తున్నది. ఆ వాకిట్లోంచి ప్రశాంతంగా నిర్జనంగా వున్న వీధీ, ఆకాశంలో తేలియాడుతున్న చందమామా కనిపిస్తున్నాడు.

"ఎవరక్కడ?" ఓల్గా ప్రశ్నించింది.

"నేనే, నేనేలే!" అని జవాబు వచ్చింది.

తలుపు ప్రక్కన, గోడకు కరచుకుని, దిస మొలతో ఫ్యోక్లా నిలబడివుంది. ఆమె చలికి వడ వడ వణికిపోతున్నది. పళ్ళు కరుచుకుపోతున్నాయి. ఆ కాంతివంతమైన వెన్నెట్లో ఆమె తెల్లగానూ, పింతగానూ, అందంగాకూడా కనబడుతున్నది. వెన్నెల నిండుకాంతితో ఆమెమీద పడుతున్నది ఆ నల్లటి కనుబొమలూ, వయసులో గట్టిగా వున్న ఆరోమ్ములూ అతి స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఆరౌడీలు నా గుడ్డలు ఊడదీసి, నన్ను ఇలా తరిమేశారు నాఖర్మ – ఇలా దిసమొలతో ఇంటికి రావలసివచ్చింది. ఏదన్నా కాస్తకట్టు కోటానికి తెచ్చిపెట్టు." అని నెమ్మదిగా గొణిగినట్టు చెప్పింది.

వోల్గా, తానుకూడా వణికిపోతూ, మృదువుగానే అంది: "పోనీ, లోపలికిరా, ముందు!"

"ఆ ముసలివాళ్ళు చూడటం నాకిష్టంలేదు." అన్నది ఫ్యోక్లా.

నిజానికి అప్పటికే నాయనమ్మ కదులుతూ, ఏదో గొణుక్కుంటున్నది. "ఎవరక్కడ?" అని ముసలాయన అడగనుకూడా అడిగాడు. వోల్గా లోపలికెళ్ళి, తనదుస్తులే తీసుకొచ్చి, ఫ్యోక్లాకు తొడిగింది నిశ్శబ్దంగా తలుపులేసి, లోపలికివెళ్ళిపోదామని చూస్తూ, నిదానంగా గడపలోకి అడుగుపెట్టారు.

ఎవరైవుంటారో వూహించి నాయనమ్మ సణుగుతున్నది. "ఓసి గాలిముండా, నువ్వాటే? నిశాచరురాలివి, నిన్ను ఏదయ్యామన్నా ఎత్తుకు పోకుండా వచ్చిందేమే!"

ఫోక్లాకుగుడ్డ కప్పుతూ, "ఫరవాలేదు, చెల్లీ పద!" అని నెమ్మదిగా చెబుతూ నోల్గా ఆమెను లోపలికి తీసుకుపోయింది.

మళ్ళీ అంతలో అంతా నిశ్శబ్దమైపోయింది. కాని వాళ్ళకెప్పుడూ సరిగ్గా నిద్రపట్టదు. ఏదో ఒక రోగంతోనో, నొప్పితోనో ఎప్పుడూ ఎవరో ఒకరు నిద్రలేస్తూనే వుంటారు. ముసలాయనకు వెన్ను పోటు, నాయనమ్మకు అసూయ ఆదుర్దా, మార్యాకు భయం, పిల్లలకు గజ్జీ ఆకలీ — ఇలాతలా ఒకటి. ఇప్పుడుకూడా వాళ్ళనిద్ర అలాగే విశ్రాంతి ఎరుకుండా వుంది. ఇటునుంచి అటు పొర్లుతున్నారు. నిద్రలోనే ఏమేమో మాట్లాడుకుంటున్నారు. అప్పుడప్పుడు లేచి నీళ్లుతాగి పడుకుంటున్నారు.

అకస్మాత్తుగా ఫోక్లాకు పెద్దపెట్టున ఏడుపొచ్చేసింది; కాని తనను అదమాయించుకుని, నిద్రపట్టిందాకా లోలోపలే వెక్కుతూ పడుకుంది. అప్పుడప్పుడు నది అవతలినుంచి గంటలు వినిపిస్తున్నాయి.

ఇక్కడి గడియారం విపరీతంగా మొదట ఐదుకొట్టి, తర్వాత మూడు గంటలుకొట్టింది.

"ఓయి భగవంతుడా!" అంటూ నిద్రలేస్తూ నిట్టూర్చాడు వంటవాడు.

కిటికీలవంకచూస్తే, ఇంకా చంద్రుడే ప్రకాశిస్తున్నాడో, లేక తెల్లవారిందో చెప్పటం కష్టంగా వుంది. మార్యా లేచి బయటికెళ్ళింది. ఆమె ఆవుల దగ్గిర పాలుతీస్తున్న 'జుంయ్ జుంయ్' ధ్వనులు వినిపిస్తున్నాయి. 'కదలకుండా నుంచో!' అని అవుల్ని గదమాయించటం కూడా వినిపిస్తున్నది. నాయనమ్మకూడా బైటికి పోయింది. ఇంట్లో ఇంకా చీకటిగానే వున్నా, అన్ని వస్తువులూ స్పష్టంగా కనపడుతున్నాయి.

తెల్లవార్లూ నిద్రపట్టని నికోలాయ్ స్టవ్ మీది నించి క్రిందికిదిగి పెట్టెలోంచి కోటుతీసి తొడుక్కొని, దాని అంచులు గోళ్ళతో సరిచేసి – ఒక్క చిరునవ్వు నవ్వుకున్నాడు. తర్వాత దాన్ని జాగ్రత్తగా విప్పి, పెట్టెలోపెట్టి, పోయి స్టవ్ మీద మళ్ళీ పడుకున్నాడు.

మార్యా లోపలికి వచ్చి స్టవ్ ముట్టిస్తున్నది. ఆమె ఇంకా నిద్రమైకంలోనే వుంది; ఆమె కాళ్ళు తేలిపోతున్నట్లున్నాయి. ఆమె కలవరిస్తున్నదేమో!

లేక, బహుశా రాత్రికథలు మనస్సులో మెదలు తున్నాయేమో! గాని, స్టవ్ ముందు సవిలాసంగా కూర్చొని –

"కాదు, స్వాతంత్ర్యం మంచిది!" అంటున్నది.

## ౭

'యజమాని' ఊళ్లో దిగాడు. జిల్లా పోలీసు ఇన్స్పెక్టరును, వాళ్ళు యజమాని అని పిలుస్తారు. ఆయన ఎప్పుడు వచ్చేదీ, ఎందుకోసం వచ్చేదీ – ఊళ్లో ఒకవారం రోజులు ముందుగానే తెలుస్తుంది. ఝుకోనోలో మొత్తం ఉన్నకుటుంబాలు నలభైవే అయినా, రెండువేల రూపాయలదాకా పన్నులు బాకీ పడ్డారు.

పోలీసు ఇన్స్పెక్టరు అంగడిలో ఆగి, రెండు గ్లాసులు టీ త్రాగి, కాలినడకన మునసబుగారింటికి వెళ్లాడు. అక్కడ పన్నులు చెల్లించని రైతులంతా అతని రాకకోసం నిరీక్షిస్తున్నారు. మునసబు సెడెల్నికోవ్ ముప్ఫయేళ్ల యువకుడే అయినప్పటికీ చాలా ఖచ్చితంగా వుండేవాడు; తానుకూడా పేదవాడే అయినప్పటికీ, తానుకూడా అందరిలాగా పన్ను లెగ బెడుతున్నప్పటికీ, ఎల్లప్పుడూ అధికారుల పక్షం

మాట్లాడుతుండేవాడు. బహుశః అతను తాను గ్రామాధికారి పదవిలో వున్నందుకు గర్వించేవాడు; అతనికి అధికార వ్యామోహంకూడా వుంది. తన అధికారాన్ని ఎప్పుడూ క్రౌర్యంద్వారానే వెలిబుచ్చేవాడు. కాని, గ్రామపంచాయితీల్లో మాత్రం భయంతో వంగిపోయేవాడు. అయితే అప్పుడప్పుడు వీధిలోనో అంగడిదగ్గిరో ఒక తాగినవాణ్ణి పట్టుకొని, పెడరెక్కలు విరిచికట్టి, జెయిల్లో పెట్టేవాడు. ఒకసారి ఆసిప్‌కు బదులు, నాయనమ్మ పంచాయితీ మీటింగుకు వెళ్లి, అక్కడ తిట్టటం మొదలెట్టినందుకు, ఆమెను అరెస్టుచేసి ఒక పగలూ ఒకరాత్రీ జెయిల్లో పెట్టాడుకూడా. అతను ఎన్నడూ పట్టణంలో వుండలేదు; ఒక్క పుస్తకం చదివిన పాపాన పోలేదు. కాని ఎలాగో ఎక్కడినుంచో, కొన్ని నాగరిక ధోరణులు సంగ్రహించాడు. సంభాషణల్లో మాటిమాటికీ ఆ పుస్తకాలమాటలే వల్లించేవాడు. అతను చెప్పేదేమిటో ఎప్పుడూ అర్థం కాకపోయినా, అందుకే అతన్ని రైతులంతా గౌరవించేవారు.

ఆసిప్, మునసబుగారింటికి, తన శిస్తు పుస్తకం తీసుకువచ్చేసరికి, ఇన్స్పెక్టరు - సన్నటి ముసలి అతను, బూడిదరంగు చొక్కా తొడుక్కొని, ప్రక్క మీసాలతో - మూలన టేబిల్ దగ్గర

కూర్చొని ఏదో వ్రాసుకుంటున్నాడు. ఇల్లు శుభ్రంగా వుంది. పత్రికల్లో క త్తిరించిన బొమ్మలతో గోడలు కళకళలాడుతున్నాయి. దేవతా విగ్రహాల మూలన బల్గేరియా యువరాజు బాటెన్ బర్గ్ చిత్రం వుంది. టేబిల్ ప్రక్కన చేతులుకట్టుకొని సెడల్నికోవ్ నిలబడి వున్నాడు.

ఆసిప్‌వంతు రాగానే, సెడల్నికోవ్ చెప్పాడు: "ఇతను నూట తొంభై రూపాయ లివ్వాలయ్యా! పండగకు పూర్వం ఒక్క రూపాయి చెల్లించాడు. మళ్లీ ఆతర్వాత దమ్మిడీకూడా కట్టలేదు"

"ఏమిటి తమ్ముడూ ఇదంతా ?" ఇన్స్పెక్టర్ ఆసిప్‌వంక చూసి, ప్రశ్నించాడు.

ఆందోళన పడుతూ ఆసిప్ చెప్పుకోటం ప్రారంభించాడు: "దయచూపాలి దొరా! నన్ను కరుణించి, ఒక్కమాట వినండి. అయ్యా! నిరుడు లుటొరెట్జ్‌నుంచి వచ్చిన యజమాని చెప్పాడయ్యా ...నీ దగ్గిర గడ్డి వుందిగదా... నాకు అమ్మేసేయ్! అన్నాడండీ ... ఏం, ఎందుకమ్మకూడదు? సరే నన్నా నయ్యా...నా దగ్గిర అమ్మకానికి వంద మోపులు గడ్డి వుందయ్యా...ఆ నీటి అంచున మైదానంలో మా ఆడవాళ్ళు కోసుకొచ్చినగడ్డి...

సరేనని బేరం కుదుర్చుకున్నామండి. అంతవరకూ సజావుగానే జరిగిపోయిందయ్యా......"

తర్వాత మునసబుమీద నేరంమోపి, సాక్ష్యం చెప్పమన్నట్లుగా చుట్టూవున్న రైతులవంక చూస్తున్నాడు. అతని మొహం ఎర్రబారి చెమటపట్టింది. కళ్లల్లో తీవ్రతా, కోపం కనిపిస్తున్నాయి.

"ఇదంతా నువ్వు ఎందుకు చెబుతున్నావో నాకు తెలీటంలేదు. నేను అడుగుతున్నది ఏమిటంటే - నువ్వు ఇంతవరకూ బకాయీ ఎందుకు కట్టలేదని అడుగుతున్నాను. మీరు-ప్రతిఒక్కరూ-పన్నులు కట్టరు, ఇక మీఅందరికోసం నేనా జవాబు చెప్పుకోవలసింది!" అన్నాడు ఇన్స్పెక్టరు.

"నేను కట్టలేకపోయానయ్యా."

"ఈ మాటలవల్ల ఏమీ లాభంలేదండీ! ఒక్క చికిల్కాయేవ కుటుంబంవాళ్ళంటే నిజంగా దరిద్రులు. తక్కిన వాళ్ళందరి సంగతీ విచారించండి. అసలు మూలకారణంవేరే...వోడ్కాలో వుందండి. అంతా అరాజకపుగుంపు ఒక్కళ్ళకీ జ్ఞానంలేదు." అన్నాడు మునసబు.

ఇన్స్పెక్టరేదో వ్రాసుకున్నాడు. తర్వాత మునసబువంకచూసి ప్రశాంతంగా, మంచినీళ్ళు

తెచ్చిపెట్టమన్నంత తోణకకుండా, "బైటికి వెళ్ళిపో"మన్నాడు.

తర్వాత, త్వరలోనే ఆయన బయలుదేరి, దగ్గుకుంటూ, ఆ చౌకపారు గుర్రపుబండి ఎక్కుతున్నప్పుడు, అతని సన్నటి పొడుగాటి వెన్నుయొక్క వైఖరి చూస్తే, అతనిక ఆసిప్‌గానీ, మునసబుగానీ, ఝకోవో బకాయిలుగానీ దృష్టిలో వున్నట్టేలేదు; తన సొంత వ్యవహారాలేవో ఆలోచించుకుంటున్నట్లున్నాడు

ఆయన అలా వెళ్ళిపోయాడో లేదో, అప్పుడే చికిల్కువేన్ ఇంటినుంచి మునసబు టీ గిన్నె జప్తు చేసుకుని ఎత్తుకుపోతున్నాడు. నాయనమ్మ అతని వెంటపడి, ఊపిరితిత్తులు పగిలిపోయేటట్టు కీచుగొంతుతో, కేకలుపెడుతూ వస్తున్నది.

"అది నిన్ను తీసుకోనివ్వను! తీసుకోనివ్వను! నువ్వు నాశనంకాను!"

పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ, అతను వేగముగా నడుస్తున్నాడు. నాయనమ్మ అతనివెంట పరిగెత్తుతూ, రొజుకుంటూ, నేలమీద పడిపోయింది. కొంచెం ఆకుపచ్చగా కనిపించే ఆమె నెరసిన వెంట్రుకలు గాలిలో ఎగురుతున్నాయి. రుమాలు బుజాలపై కెగిరిపోయింది. ఆమె అంతలో హఠా

త్తుగా లేచి నిలబడి. ఓ పెద్ద తిరుగుబాటు దారు లాగా, రొమ్ములు బాదుకుంటూ, ఎప్పటికంటే పెద్దగా కేకలుపెడుతూ, స్వప్రహాతప్ప్రుతుందేమో అన్నట్టు, అరుస్తున్నది :

" భగవంతుడిమీద విశ్వాసంగల ఓ క్రైస్తవు లారా ! స్నేహితులారా ! చూడండీ ! వాళ్ళు నాకు అన్యాయంచేశారు ! స్నేహితులారా ! వాళ్ళు నన్ను అణగదొక్కి పారేస్తున్నారు ! మీరంతా నాకు సహాయం చెయ్యండి, రండి ! "

"నాయనమ్మా, నాయనమ్మా ! నీ బుర్రలోకి కాస్త తెలివి తెచ్చుకో !" అన్నాడు గ్రామాధిగారి కఠినంగా.

ఇంట్లో టీ గిన్నె లేకపోవటమంటేదుస్సహంగా వుంది. అందులో ఏదో అవమానం, ఏదో అల్పత్వం -దాంతోటే ఆ యింటి మర్యాద అంతా మంట గలిసినట్లుగా - అనిపిస్తున్నది. గ్రామాధికారి ఆ టేబిల్ గానీ, బెంచీలన్నీగానీ పట్టుకుపోయినప్పటికీ, ఇల్లింత బోసిక్కొట్టేదికాదు. నాయనమ్మ పెడ బొబ్బలు పెట్టింది. మార్యా ఏడ్చింది. ఆమె కన్నీళ్ళు చూచి పిల్లలంతాకూడా ఏడ్చారు ముస లాయన మాత్రం, తప్పుచేసినట్టు అనుకొని, తల వ్రేలవేసుకొని నిశ్శబ్దంగా మూలన కూర్చుని

వున్నాడు. నికోలాయ్ కూడా నిశ్శబ్దంగానే వున్నాడు. నాయనమ్మకు అసలు నికోలాయ్ అంటే ప్రేమే. దయే. కాని, ఇప్పుడు అదంతా మరచి పోయి, అతని మొహంమీదికి పిడికిలి చూపుతూ తిట్లతో నిందలతో అతనిమీద విరుచుకు పడింది. ఇదంతా అతని తప్పేననీ; స్లావ్యాన్స్కి బజార్లో నెలకు యాభై సంపాదిస్తున్నానంటూ ఉత్తరాలు వ్రాసేవాడు ఇంటికి. అంత తక్కువ మొత్తం ఎందుకు పంపవలసివచ్చిందనీ – కేకలు వెయ్యటం మొదలుపెట్టింది. ఇప్పుడు అసలెందుకొచ్చాడు ? అదీ, కుటుంబంతోకూడా ! అతను చచ్చినట్టయితే సమాధి చెయ్యటానికైనా డబ్బు ఎక్కడినించి వచ్చేది ! ఆ సమయంలో నికోలాయ్, వోల్గా, శాషాల ముఖాలు నిజంగా జాలిగొలుపుతున్నాయి.

ముసలాయన కఠోరంగా నిట్టూర్చి, టోపీ తగిలించుకొని, మునసబు దగ్గరికి పోయాడు. అప్పుడే చీకటి పడుతున్నది. సెడెల్నికోవ్, స్టవ్ దగ్గర కూచొని, నోటితో ఊదుతూ, ఏదో టంకం పెట్టి అతికిస్తున్నాడు. ఇల్లంతా పొగతో నిండివుంది. అతని పిల్లలుకూడా సన్నగా, మురికిగా, శుచిఅనేది ఎరగనట్లుగా నేలమీదపడి దొర్లాడుతున్నారు. చికిల్దేవ్ ఇంట్లో పిల్లలకంటే ఏమీ బాగా లేరు. అతని

భార్య అసహ్యంగా ఒక బానకడుపు పెట్టుకొని, సిల్కుదారం తీస్తున్నది. అదేకాకుండా ఒక దౌర్భాగ్యపు కుటుంబం. అందులో ఒక్క సెడెల్నికొవే దృఢంగా చక్కగా వుంటాడు. అక్కడ బల్లమీద వరసనే నాలుగు టీ పాత్రలు కనిపిస్తున్నాయి. ముసలాయన బగ్తెరిమా యువరాజు శాంతి బగ్నను ధ్యానించి, ఇలా అన్నాడు:

"సెడెల్నికొవ్, దయనావు! క్రీస్తు మొహం చూసి, నా టీ పాత్ర నాకుయిచ్చెయ్యి!"

"మూడురూపాయలు పట్టుకురా, అలాగే తీసుకుందువుగాని."

"నేను తేలేను."

సెడెల్నికొవ్ పోయిఊదాడు. బస్సున మంట లేచి, టీ పాత్రలమీద ప్రతిఫలిస్తున్నది. ఆశేష టోపీ చేతిలో పట్టుకొని, ఒకక్షణం ఆలోచించి మళ్ళీ అడిగాడు ;

"నువ్వు నా టీ పాత్ర నాకు ఇవ్వు!"

గ్రామాధికారి కారునల్లగా, గారడీ వాడిలాగా, కనిపిస్తున్నాడు. అంతలో ఆసిరి వంక తిరిగి, గబగబా మాట్లాడుతూ, కఠినంగా చెప్పేశాడు:

"అదంతా జిల్లా కలెక్టరు యిష్టం. యిరవైఆరో తారీఖున పరిపాలక సమావేశంలో నీ అసంతృప్తి

అంతా నోటితోగానీ, వ్రాతమూలకంగా గానీ, సకారణంగా చెప్పుకోవచ్చు."

ఆసిఫ్‌కు ఒక్కమాటకూడా అర్థం కాలేదు. కాని దానితో సంతృప్తిపడి ఇంటిదోవపట్టాడు.

పదిరోజుల అనంతరం పోలీస్ ఇన్స్పెక్టరు మళ్ళీ వచ్చి, ఒక గంటసేపుండి, వెళ్ళిపోయాడు. ఆ రోజుల్లో చలిజాస్తీ అయింది. గాలికూడా ప్రళయంగా వీచింది. చాలాకాలం నది అంతా గడ్డకట్టుకు పోయిందిగాని, ఇంకా ఎక్కడా మంచు కురవటం లేదు. రోడ్లు నడవటానికి వీలుకాక, జనం అల్లాడి పోయారు. ఒక సెలవుదినం సాయంత్రం, కొంచెం సేపు కూచొని మాట్లాడు కుందామని కొందరు ఇరుగుపొరుగువాళ్ళు ఆసిఫ్ ఇంటికి వచ్చారు. ఆ రోజున పనిచెయ్యటం పాపంకనుక వాళ్ళుదీపం కూడా వెలిగించలేదు. అందువల్ల అందరూ చీకట్లోనే కూచొని మాట్లాడుకోవలసివచ్చింది. కొన్ని కొన్ని సంగతులు చెప్పుకున్నారుగాని, నిజానికి అన్నీ ప్రతికూలమైనవే. పన్ను బకాయీలక్రింద రెండు మూడు ఇళ్ళల్లోంచి కోడిపెట్టల్ని పట్టుకు పోయి, మునసబు, జిల్లా ఆఫీసుకు పంపాడు. అక్కడ ఎవ్వరూ తిండిపెట్టక, అవి చచ్చిపోయాయట. అలాగే గొర్రెల్ని కూడా తోలుకు

పోయాయి. ఊరినుంచి ఊరుకు వాటిని అంచెలమీద బళ్ళల్లో కట్టేసి తీసుకుపోవలసివచ్చింది అలా ఊరూరికీ మార్చటంలోను, ఆ కట్టివెయ్యటంలోనూ అసలు అడంగుకు చేరేటప్పటికి ఒక గొర్రె చచ్చిపోయింది. ఇప్పుడు: ఈ తప్పు ఎవరిది? అనే విషయం చర్చిస్తున్నారు.

"గవర్నమెంటుదే! కాకపోతే, మరెవరిది?" అన్నాడు ఆశిప్.

"నిజంగా గవర్నమెంటుదే!"

అన్నిటికీ గవర్నమెంటునే తిడతారు — పన్ను బకాయీలకు, అక్రమ వసూళ్ళకు, పంటలు పండక పోవటానికి, అన్నింటికీకూడా. కాని, గవర్నమెంటంటే ఏమిటో కూడా అందులో ఎవ్వరికీ ఏమీ తెలేదు కొట్లూ, ఫ్యాక్టరీలూ, హోటళ్లూ పెట్టుకున్న ధనికరైతులు పూర్వం ఈ గవర్నమెంటు సంస్థల్లో సభ్యులుగా వుంటూ వాటిమీద అసంతృప్తి చెంది, గవర్నమెంటును గురించి తమ తమ ఫ్యాక్టరీలలోను, కొట్లల్లోను, హోటళ్లలోను కించపరచి మాట్లాడిననాటినుంచీ ప్రతిదానికీ గవర్నమెంటును నిందించటం అలవాటైపోయింది. వంట చెరుకు కోసం చెట్లు కొట్టుకురావాలి: కాని దేవుడింకా మంచు కురిపించకుండా ఎలా వున్నాడో వాళ్ళు

చర్చించారు. వెనకటి రోజుల్లో, పదిహేను ఇరవ య్యేళ్ళ క్రితం, ఝుకోవోలో మాట్లాడటమంటే యింకా చాలా సరదాగా వుండేది. ఆరోజుల్లో ప్రతి వృద్ధుడూ - తానేదో రహస్యాన్ని కాపాడు తున్నట్లూ, తన కేదో తెలిసి, మరి దేనికో సమ్మో కనిపెట్టుకుని వున్నట్లూ - కనిపించేవాడు. బంగారు ముద్రవేసిన ఫర్మానాను గురించీ, ఎకరాల పంపకం గురించీ, కొత్త భూముల్ని గురించీ, లంకెబిందెల్ని గురించీ అరోజుల్లో వాళ్ళు మాట్లాడుకునేవారు; మరి వేటివేటిఃగాదనో ధ్వనించే వారుకూడా. యిప్పటి ఝుకోవా మనుషుల కే రహస్యాలూ లేవు. వాళ్ల జీవితమంతా, అరచేతిలో పెట్టినట్టు, స్పష్టంగా బట్టబయలుగా కనపడుతుంది. కరువు, తిండి, గొడ్ల మేత, మంచురాక పోవటం...ఇవి తప్పితే మాట్లా డుకోటానికి కూడా వాళ్ల కేమీా సంగతుల్లేవు.

కొంతసేపు అంతా నిశ్శబ్దంగా ఊరుకున్నారు. తర్వాత మళ్లీ కోడిపెట్టలమాటా, గొర్రెల సంగతీ లంకించుకొని, 'తప్పు ఎవరిది?' అని చర్చించటం మొదలు పెట్టారు.

"మరెవరిది, గవర్నమెంటుదే!" అన్నాడు ఆసిప్, వ్యసనంగా.

౮

అసలు పెద్దచర్చి, ఝుకోవోకు నాలుగుమైళ్ళ దూరంలో, కొసోగొరొవోలో వుంది. బిడ్డలకు నామకరణం చెయ్యటానికీ, పెళ్ళిళ్ళకూ, అంత్య క్రియలకూ – ఇలాంటి ముఖ్యమైన వాటన్నిటికీ ఝుకోవారైతులు అక్కడికి వెళతారు. తక్కిన నిత్యకృత్యాలన్నీ నది అవతల వున్న చిన్న చర్చిలోనే జరుపుకుంటారు. సెలవురోజుల్లో, గాలి హాయిగా వున్నప్పుడు, ఊళ్లో స్త్రీలందరూ చక్కని దుస్తుల్లో ముస్తాబై, రంగురంగుల ఉడుపుల్లో ఎర్రగా, పసుపుపచ్చగా, ఆకుపచ్చగా, ఆమైదానంలో నడుస్తూంటే నేత్రపర్వంగా వుంటుంది. కాని గాలి ఈదరగా వున్నప్పుడు అంతా ఇళ్ళదగ్గరే వుండి పోతారు. ఆత్మశోధనకూ దైవప్రసాదానికీ వాళ్లు పెద్ద చర్చికే వెళతారు. ఈస్టర్‌లో క్రాస్‌తో, పురోహితుడు అన్ని ఇళ్లూ తిరుగుతూ, ఉపవాసదినాల్లో సంస్కారం పొందనివారిదగ్గర అపరాధం వసూలు చేసేవాడు.

ముసలి ఆసిప్ ఎప్పుడూ దేవుణ్ణి గురించి ఆలోచించనే లేదు కనుక, అతనికి దేవుడిమీద నమ్మకం

లేదు. అయితే అతను మానవాతీతమైన శక్తిని గుర్తిస్తాడు కాని, దాని విషయం ఆడవాళ్ళు చూసుకోవలసిందేనని అతని అభిప్రాయం. మతాన్ని గురించిగానీ, దైవలీలలను గురించిగానీ అతని ఎదట చర్చించినప్పుడు; లేదా, ఈ విషయాల్లో అతన్ని ఏదన్నా ప్రశ్న వేసినప్పుడు - అంతా ఒక్కసారిగా కొట్టివేస్తూ, అయిష్టంగా, "అవుతా ఏమో, ఎవడు చెప్పగలడు? పో"మ్మంటాడు.

నాయనమ్మకు దేవుడిలో విశ్వాసమైతే వుంది గాని, అది అంత నిలకడ అయింది కాదు. ఆమె మనస్సు నిండా ఆన్నీ కలగాపులగంగా వుంటాయి. పాపాలూ, చావూ, ఆత్మవిముక్తి మొదలైనవి ఆమె ఆలోచించటం ఆరంభిస్తుందో లేదో, అంతే లోనే అనేక అవసరాలూ అనేక శ్రద్ధలూ ఆమె మనస్సునిండా అలముకుంటాయి. అవెవుకు దేన్ని గురించి ఆలోచిస్తున్నదో, తక్షణం ఆ విషయమే మరచిపోతుంది. ఆమెకు ప్రార్థనలుకూడా ఏమీ రావు. మామూలుగా సాయంత్రమప్పుడూ, నిద్ర పోయేముందూ, ఆమె విగ్రహాల కెదురుగా నిలబడి, "ఓకజాన్ తల్లీ, కన్యా! ఓ స్మోలెన్స్కా తల్లీ, కన్యా!..." అని లోలోపల గొణుక్కుంటూ వుంటుంది. అదే ఆమె ప్రార్థనంతా.

మార్యా శ్లోకాలు రోజురోజూ శిలువను స్మరిస్తుండేవాళ్ళు ప్రతియేటా దైవప్రసాదం తీసుకునేవాళ్లు. - అయితే ఇదంతా ఏమీ తెలీకుండానే చేస్తుండేవాళ్లు. పిల్లలకు ఎవ్వరూ ఒక్క ప్రార్థనకూడా నేర్పలేదు, దేముణ్ణి గురించి ఏమీ చెప్పలేదు, నీతిసూత్రాలుకూడా ఏమీ బోధించలేదు ఉపవాస దినాల్లో కొన్ని కొన్ని వస్తువులు తినకూడదని మాత్రమే వాళ్లకు తెలుసు. తక్కిన కుటుంబాల పరిస్థితికూడా చాలా భాగం ఇంతే. అసలు దైవ విశ్వాసం కలవాళ్లే కొద్దిమంది; అందులోనూ ఏమన్నా తెలిసినవాళ్ళు మరీ కొద్ది అలా వుండికూడా, అందరూ బైబిల్‌ని హృదయపూర్వకంగా భక్తి ప్రపత్తులతో ప్రేమించేవారు. కాని వాళ్ళదగ్గర ఒక్క పుస్తకమైనా వుండదు. బైబిల్ చదివేవాళ్ళుగానీ, చెప్పేవాళ్ళుగానీ ఎవ్వరూ లేరు. అందువల్లనే వోల్గా వాళ్లకు బైబిల్ చదివి వినిపించటం ఒక గొప్ప అయింది. అంతా ఆమెనూ శాషానూ 'ఏమండి' 'మీరు' అంటూ గౌరవ సూచకంగా పలకరించేవారు.

అప్పుడప్పుడు సెలవురోజుల్లో, ప్రత్యేక ఉత్సవ సమయాల్లో, వోల్గా చుట్టుపట్లగ్రామాలకూ, జిల్లా కేంద్రానికీ వెళ్లివస్తుండేది. జిల్లాకేంద్రంలో రెండు

మఠాలూ, ఇరవైమేడు చర్చీలు వున్నాయి. ఇలాంటి ప్రయాణాలు చేసేటప్పుడు ఆమె తన కుటుంబ వ్యవహారాలన్నీ మరచిపోయి, అదే ధ్యాసలో వుండేది. మళ్లీ ఇంటికితిరిగి వచ్చేటప్పుట మాత్రమే, అకస్మాత్తుగా, తనకు ఒక భర్తా కుమార్తె వున్నారని స్ఫురణకువచ్చి, నవ్వుకుని, కళకళలాడుతూ, " దేవుడు నన్ను కరుణించాడు! " అనుకునేది.

ఊళ్లో జరిగే విషయాలు ఆమెకు ఉప్పలాయి గానూ, బాధాకరంగానూ వుండేవి. అదీ ఇదీ అన కుండా ప్రతి పండగకూ ఊళ్లో అందరూ తాగే వాళ్లు. మరీ విందు వచ్చిందంటే, వరసనే మూడు రోజులూ రాత్రింపగళ్లూ తాగేసేవాళ్లు. ఇందు కోసం ఇంటింటినుంచీ వసూలు చేసింది చాలక ఊరి ఉమ్మడి డబ్బు యాభైరూపాయలు తగలేసేవారు. మొదటినాడే ఆసిప్ ఇంట్లో ఒకగొర్రెను కోసి మాంసం వండేవారు. ఇక ఆరోజల్లా పొద్దునా, మధ్యాహ్నం, రాత్రీ అంతులేకుండా, అంతా మాంసం తెగతినేసేవారు. పిల్లలు అర్ధరాత్రి పూట నిద్రలేచి, మళ్లీ తింటూండేవారు. ఆ మూడు రోజులూ కిర్యాక్ భయంకరంగా తాగివుండేవాడు; తనదగ్గిరవున్న ప్రతివస్తువూ, చివరకూ బూట్లూ

టోపీకూడా పెట్టి త్రాగేసేవాడు. ఇంటికి వచ్చి మార్యాను చచ్చేటట్టు కొట్టేవాడు. మళ్లీ ఆమెకు స్పృహరావటం కోసం ఇంట్లో అంతా శైత్యోప చారాలు చెయ్యవలసివచ్చేది. ఆ తర్వాత మళ్లీ అందరూ సిగ్గుతో క్రుంగిపోతుండేవాళ్ళు. ఇదీ వాళ్ల పండగ సంబరం.

ఝుకోవోవంటి గూడెంలోకూడా ఏడాదికొక సారి నిజంగా మహోత్సవం జరిగేది. ఆగస్టులో, ప్రాణధారిణి అయిన దేవమాత విగ్రహాన్ని జిల్లాలో గ్రామగ్రామానికీ ఊరేగిస్తూ చర్చి అధికారులు బయలుదేరుతారు. అప్పుడు ఒకనాడు ఝుకోవోకు వస్తారు. అదే అక్కడ నిజంగా జరిగే మహోత్సవం. ఈ ఊరేగింపు ఝుకోవోకు వస్తుందనుకున్ననాడు ఆకాశం నిండా మబ్బులు కమ్మి, గాలి ఆడకుండా వుంది. ఆనాడు ప్రొద్దునే, స్త్రీలు రంగురంగుల దుస్తులు అలంకరించుకుని, ఊరేగింపుకు ఎదురు పోయి, సాయంత్రానికల్లా ఓ పెద్ద కోలాహలంగా విగ్రహాన్ని తీసుకుని, ఆడుకుంటూ పాడుకుంటూ ఊరివైపు వచ్చేశారు. అప్పుడే నది అవతలి చర్చి గంటలు మ్రోగుతున్నాయి. గ్రామస్థులూ, చూడ వచ్చిన పక్కఊళ్లవాళ్లూ అంతా వీధి నిండా గుమి గూడారు ఒక్కటేరణగొణధ్వని, దుమ్ము, తోపిడి...

ముసలి ఆసిప్, నాయనమ్మా, కిర్యాక్, అంతా విగ్రహం వంక చేతులుజాపి, "తల్లీ, మా కోసం ప్రార్థించు, తల్లీ?" అంటూ ఆ విగ్రహం వంక పేరాసగా చూస్తూ, ఏడుస్తున్నారు.

భూమికీ స్వర్గానికీ మధ్యవున్నది శూన్యం కాదనీ; ధనవంతులూ అధికారులూ ఇంకా ప్రతి దాన్నీ చేజిక్కించుకో లేదనీ; ఈ తిట్లనించీ, దాస్యం నించీ, దుర్భరమైన కరువుకాటకాలనించీ, భయంకరమైన వోడ్కానించీ, ఇంకా తమకు రక్షణ వున్న దనీ - అంతా అకస్మాత్తుగా అర్థంచేసుకుంటున్నట్టున్నారు.

"తల్లీ! మాకోసం ప్రార్థించు! మాకోసం! తల్లీ!..." అని మార్యా నిట్టూర్పుతున్నది.

ఉత్సవం అయిపోయింది. ఊరేగింపు అవతలి గ్రామానికి వెళ్ళిపోయింది. తర్వాత, మళ్ళీ అన్నీ మామూలుకు భిన్నం లేకుండానే జరుగుతున్నాయి. అంగడి వైపునించి త్రాగుబోతుల కేకలు వినిపిస్తున్నాయి.

ఒక్క ధనికరైతులకు మాత్రమే చావంటే భయం. సిరిసంపదలు పెరిగినకొద్దీ, భగవంతుడిలోనూ ఆత్మ విముక్తిలోనూ విశ్వాసం తరిగిపోతూ వుండేది. కాని, ఎటుపోయి ఎటువచ్చినా మంచిదే

అని, స్వప్రయోజనంకోసం, కొవ్వొత్తులు వెలిగించి, ప్రార్థనలు జరిపించేవారు.

ఆసిప్‌కూ నాయనమ్మకూ అంతా మొహం మీదుటనే చెప్పేవాళ్ళు - మీరు ఇప్పటికే చాలా కాలం జీవించారు, మీరు చావవలసిన సమయం ఆసన్నమైంది - అని. కాని, వాళ్లేమీ గమనించి నట్లు కనపడేదికాదు. "నికోలాయ్ చనిపోయాక నీ భర్త డెనిస్‌ను సైన్యంలోంచి విడుదలచేస్తా"రనీ, "అప్పుడే అతను ఇంటికివస్తా"డనీ, వాళ్ళు నికోలాయ్ ఎదుటనే ఫ్యోక్లాకు నిస్సంకోచంగా చెప్పే వాళ్ళు. ఇక మార్యా సంగతి చూస్తే, ఆమెకు చావంటే భయం లేకపోగా, ఇంకా చావు రాలేదేమా అని విచారించేది; తన బిడ్డలు చనిపోయినప్పుడు నిజంగా సంతోషించింది కూడా.

ఏమైనా, మృత్యువంటే వాళ్ళకెవరికీ భయం లేదుగాని, రోగమంటే వాళ్ళకు అమితమైన భయం. ఏదన్నా చిన్నజబ్బు - కడుపుబ్బటమో, కాస్త జలుబో - వచ్చిందంటే సరి, నాయనమ్మ స్టవ్ మీద చేరి దుప్పటి ముసుగుపెట్టుకొని. "చస్తున్నానో" అని వలపోస్తుండేది. ముసలాయన పోయి పురోహితుణ్ణి పిలుచుకొచ్చేవాడు. ఆమె అంత్య సంస్కారం తాలూకు కర్మకాండ జరిపించు

కునేది. కాని, మర్నాటికల్లా మామూలుగానే తిట్టుకుంటూ తిరుగుతుండేది. వాళ్ళు తరచు రొంపలను గురించీ, క్రిముల్ని గురించీ, కడుపుల్లో పుట్టి గుండెల కెగబ్రాకే గ్రంథుల్ని గురించీ చర్చించుకునేవారు. అందరూ కూడా, జలుబు చేస్తుందనే భయం కొద్దీ, ఎండకాలంలో సైతం వంటినిండా గుడ్డలు కప్పుకొని, వెచ్చదనానికి స్టవ్ మీదికి చేరుతుండేవారు. నాయనమ్మకు మందు తినటం ఇష్టం. తరచుగా ఆస్పత్రికి వెళ్ళేది. అక్కడ తనకు డెబ్భై ఏళ్ళని చెబితే డాక్టరు మందివ్వడేమోనని యాభై ఏళ్లని చెప్పేది. కాని, ఎన్ని మందులు తిన్నప్పటికీ, తనకు మరణసమయం ఆసన్నమైందని కూడా అంటుండేది. ఆమె ఇద్దరు ముగ్గురు పిల్లల్ని వెంట పెట్టుకొని, ఉదయాన్నే ఆస్పత్రికి పోయి, తనకేదో ద్రావకమూ, పిల్లలకు మలాములూ తీసుకుని, సాయంత్రానికల్లా ఆకలితో కోపంగా ఇంటికి వచ్చేది. ఒకనాడు ఆమె నికోలాయ్‌ని కూడా తీసుకుపోయింది. అతనొక పక్షం రోజులు మందు త్రాగి, కొంత ఆరోగ్యం చేకూరినట్లున్నదన్నాడు కూడా.

ఆ చుట్టుపక్కల ఇరవై మైళ్ల లోపునవున్న డాక్టర్లూ, కాంపౌండర్లూ, నాటువైద్యులూ అందరూ నాయనమ్మకు తెలుసు. అందులో ఒక్కరిమీదా

ఆమెకు నమ్మకంలేదు. విందునాడు శిలువతీసుకొని ఇంటింటికీ పురోహితుడు వచ్చినప్పుడు, అతనితో పాటు వచ్చిన శిష్యుడొకడూ జైలుదగ్గిరున్న పట్ట ణంలో ఒక ముసలి డాక్టరున్నాడనీ, అతను వెనుక మిలిటరీ సర్జన్ దగ్గిర అసిస్టెంటుగా పనిచేసినవాడనీ, చాలా రోగాలు నయంచేసాడనీ, అతని దగ్గరికి వెళ్లమనీ – నాయనమ్మకు సలహా ఇచ్చాడు. ఆమె అతని మాట శిరసావహించింది. తొలిమంచు కురి సిన తర్వాత, ఆమె పట్నానికిపోయి, ఆ ముసలి డాక్టర్ని పట్టుకొచ్చింది. అతను యూదుల్లో కలి సినవాడు; పెద్దకోటు తొడుక్కొని, పొడుగాటి గడ్డంతో, మొహంనిండా నీలి రక్తనాళాలు పైకుబికి వలలాగా అల్లుకొని వున్నాడు. ఆమె తిరిగి వచ్చే సరికి యింట్లో అందరూ తలొకపనీ చేసుకుంటు న్నారు. భయంకరమైన కళ్లజోడు పెట్టుకొని ఒక ముసలిదర్జీవాడు పాతగుడ్డల్లోంచి చిన్న కోటుకు కత్తిరిస్తున్నాడు. యిద్దరు యువకులు వూలుపెట్టి, కాన్వాస్ చెప్పులు తయారుచేస్తున్నారు. త్రాగి నందువల్ల ఉద్యోగంపోయి, యిప్పుడింటిదగ్గరే వుంటున్న కిర్యాక్, దర్జీవాడి పక్కన కూర్చొని గుర్రానికి పట్టెడ కుడుతున్నాడు. యిల్లంతా జనంతోనిండి, అసహ్యంగా దుర్వాసన కొడుతు

న్నది. ఆ యూదుల్లో కలిసిన డాక్టరు నికోలాయ్‌ని పరీక్షచేసి, అతనిలో చెడురక్తం వుందనీ, దాన్ని తీసి పారెయ్యాలనీ చెప్పాడు.

అతని రొమ్ముల్లోంచి చెడ్డరక్తం లాగుతూంటే, ఆ ముసలిదర్జీ, కిర్యాక్, చిన్నపిల్లలూ అంతా చుట్టూ చేరి చూస్తూ నిల్చున్నారు. నికోలాయ్ శరీరంలోంచి రోగం బయటికి వచ్చేస్తున్నట్టే అనిపించింది వాళ్ళకు. తన రొమ్ములోంచి వచ్చిన రక్తం, నల్లగా గ్లాసునిండటం చూస్తుంటే, నికోలాయ్‌కూడా, తనలోంచి ఆ దుష్టరక్తం పోతున్నదన్న ఆనందంతో చిరునవ్వు నవ్వాడు.

"చాలా మంచిపని! నీకు ఆరోగ్యం చేకూరుతుంది!" అన్నాడు దర్జీవాడు.

యిలా పది పన్నెండు గ్లాసుల రక్తం తీసి, టీ త్రాగి, డాక్టరు వెళ్ళిపోయాడు. నికోలాయ్ వడవడా వణకటం మొదలుపెట్టాడు. అతని మొహం కుంగదీసుకుపోయింది. ఆడవాళ్ళు చెప్పినట్టు — చిన్న గుప్పిడి అంతగా ముడుచుకుపోయింది. వ్రేళ్ళు నీలి రంగులోకి దిగాయి. పెద్ద తోలుకోటు తొడుక్కొని దుప్పటి కప్పుకొన్నప్పటికీ, అతనికి అంతకంతకూ చలి ఎక్కువయిపోయింది. సాయంత్రం వేళకు బాగా రోగగ్రస్తుడైనట్లనిపించి, తనను క్రింద పడుకో

పెట్టమని కోరాడు. పొగకు తట్టుకోలేక, దర్జీవాణ్ణి చుట్ట కాల్చవద్దని ప్రతిమాలుకున్నాడు. తర్వాత ఆ కోటులో నిశ్శబ్దంగా ముడుచుకుపోయి, తెల్లవారే సరికి మరణించాడు.

## ౭

చలికాలం, దీర్ఘంగా, ఎంతకీ గడచి పోకుండా వుంది.

క్రిస్టమస్ సరికి ఇంట్లో గింజలైపోయి, అప్పుడే ఆసిప్ కుటుంబం అంగడిలో కొనుక్కోటం మొదలెట్టారు. పక్కింటిదగ్గిరే వుంటున్న కిర్యాక్ మాపటివేళ తాగి వచ్చి అందరికీ భీతిగొలుపుతూ వుండేవాడు. మళ్లీ తెల్లవారే సరికి, చచ్చి సగమై, తలనొప్పితోను సిగ్గుతోను బాధపడుతూ దయనీయంగా కనిపించేవాడు. రాత్రింపగళ్లూ, తిండి లేకుండా కొట్టంలో పడివున్న ఆవు అరిచే అరుపులు వింటుంటే నాయనమ్మకూ మార్యాకూ గుండెలు పగిలి పోయేవి. ప్రకృతికి కోపం వచ్చినట్లుగా, నేల మీద గడ్డకట్టిన మంచు కరగటమే లేదు. గదిలో మంచుగడ్డలు విపరీతంగా కొట్టుకొస్తున్నాయి. ఇంకా చలికాలం పొడుగవుతూనే వుంది. ప్రబోధం నాడు

మంచు తుపాను వీచింది. ఈస్టరురోజున మంచు కురిసింది.

కాని, చిట్టచివరకు ఎలాగో శీతకాలం గట్టెక్కింది. ఏప్రిల్ మొదట్లో పగళ్ళు వెచ్చగా వుండి' రాత్రులు మళ్ళీ మంచుపడేది. చలికాలం అంతంత మాత్రంగా లొంగిపోలేదు. కాని చివరకు ఒక నిప్పులు కురిసే మధ్యాహ్నం చలిని లొంగదీసింది. దాంతో ఏరులూ వాకలూ పారటం ప్రారంభించాయి. పక్షుల కలకలం కూడా ప్రారంభమైంది. నది అంచునవున్న గుబుర్లూ, మైదానమూ- అంతా ఆ ప్రవాహాల్లో మునిగిపోయింది. ఝుకోవ్ నుంచి నది అవతలి అంచుదాకా ఒక పెద్ద మహాసముద్రం లాగావుంది. అందులో అక్కడక్కడా, మధ్యమధ్య అడవిబాతులు కదుపులు కదుపులుగా తేలియాడుతున్నాయి. ప్రతి సాయంత్రం ఆ వసంత సూర్యాస్తమయ సమయంలో మేఘమాలికలు చిత్ర వర్ణ కిమ్మీరితాలై, అద్భుతదృశ్యాలు ప్రదర్శిస్తున్నాయి. ఆరంగులే, ఆ మబ్బులే– చిత్రాల్లో చూచినప్పుడు, అంత నేత్రపర్వంగా వుండవుకూడా.

ఎవరినో పిలుస్తున్న ధోరణిలో అరుస్తూ, కొంగలు ఆకాశంలో బార్లుదీరి వేగవేగంగా వెళ్లిపోతున్నాయి. స్లోపు అంచున నిలబడివున్న వోల్గా,

ఆ నీటితో నిండిన మైదానంవంకా, సూర్యాస్తమయంవంకా, ఆ కాంతిలో మిలమిలలాడుతూ, కొత్త తేజస్సు నింపుతున్న చర్చీవంకా చూస్తున్నది. కన్నీళ్ళు కారుస్తూ, ఊపిరికోసం తడబడుతున్నది: ఎలాగైనాసరే యిక్కడనుంచి ఎక్కడికో అక్కడకి—ఈ ప్రపంచం చివరకు—వెళ్ళిపోవాలనే ఆమె ఆవేదన అంత బలీయంగా వుంది. ఆమె మాస్కో వెళ్ళి ఎవరింట్లోనన్నా పనిమనిషిగా కుదరటానికీ; కిర్యాక్ కూడా ఆమెతో వెళ్ళి ఎక్కడన్నా కాపలా పనిగానీ, అలాంటి దేదన్నాగానీ చూచుకోటానికీ—అది వరకే నిశ్చితమైంది. కాని, తొందరగా ఇక్కడనించి వెళ్ళిపోతే నయం!

నేల ఎండి, గాలి వెచ్చబడగానే, వారు ప్రయాణానికి తయారైనారు వోల్గా, ఖాషాలు మూటలు బుజానవేసుకొని, చెప్పులు తొడుక్కొని బయలుదేరారు. వాళ్ళను పంపటానికి మార్యా కూడా బయలు దేరింది. కిర్యాక్ ఆరోగ్యంగా లేక, మరో వారం ఇంటిదగ్గిర వుండాలనుకున్నాడు. చిట్టచివరిసారి వోల్గా చర్చివంక చూచి, వినయ పూర్వకంగా నమస్కరించి లోలోపలే ప్రార్థన చేసుకుంది. తన భర్తను తలచుకొని, ఆమె పెద్దపెట్టున శోకాలు పెట్టలేదుగాని, ఆమె ముహం

ముడతలుపడి, వృద్ధాప్యంలో లాగా అయిపోయింది. ఈ చలికాలంలో ఆమె సన్నపడింది, పాలిపోయింది; వెనకటి చక్కని రూపం హాయైన ఆ చిరునవ్వూ మటుమాయమై పోయి, ఆమె అనుభవించిన కష్టాల తాలూకు దుఃఖం ముఖంమీద మూర్తీభవించింది; చెవిటివాళ్లకిలాగా, ఆమె చూపులో ఒకరకం స్తబ్ధత ఏర్పడింది.

ఝుకోవో గ్రామాన్నీ, ఆ రైతుల్నీ వదిలిపెట్టి పోవటం ఆమెకు విచారంగానే వుంది. నికోలాయ్ చనిపోయినప్పుడు, అతన్ని సమాధికి అంతా కలిసి ఎలా మోసుకుపోయారో, తర్వాత అతని ఆత్మశాంతికోసం అందరూ ఇంటింటా ఎలా ప్రార్థనలు చేశారో, తన దుఃఖానికి సానుభూతితో అంతా ఎలా విలపించారో — ఆమె ఇంకా నెమరు వేసుకుంటూనే వుంది. కాని, ఈజనం జంతువులకంటె అన్యాయంగా బ్రతుకుతున్నారనీ, వీళ్లతో జీవించటం దుర్భరమనీ — ఎండకాలంలోనూ శీతకాలంలోనూ గంటల తరబడీ కూడా — అనిపించేది. వాళ్లు వట్టి మోటువాళ్లు, నీతిలేదు, తాగి దుమ్ముకొట్టుకొని అసహ్యంగా వుంటారు. ఒకళ్లతో ఒకళ్ళు కలిసి మెలసి వుండకుండా, ఒకర్ని చూసి ఒకరు భయపడుతూ, ద్వేషించుకుంటూ అనుమానించు

కుంటూ నిరంతరం పోట్లాడుకుంటూ వుంటారు. ఈ అంగళ్ళు పెట్టించి, వాటిని ప్రోత్సహించేది రైతుకాదా? సూక్కళ్ళడబ్బా, ఊరిడుమ్మడి డబ్బా, చర్చిడబ్బా సంగ్రహించి, తాగేసేది రైతుకాదా? ఇరుగుపొరుగిళ్ళల్లో దొంగిలించేద్, ఇళ్ళకు నిప్పు పెట్టేద్, ఒక్క నోడ్కాబుడ్డి కోసం కోర్టుల్లో తప్పుడు సాక్ష్యాలు చెప్పేది, రైతుకాదా! ప్రభుత్వ సంస్థల సమావేశాల్లో రైతులకు వ్యతిరేకంగా ముందు గొంతెత్తేది రైతుకాదా? అలాంటి వాళ్ళతో జీవించటం భయంకరంగానే వుంటుంది. కాని వాళ్ళుకూడా మానవులే, మానవుల్లాగానే బాధలుపడేవారు, శోకించేవారు. పాపం, సమర్థనీయం కాని దోషం ఏదికానీ వాళ్ళల్లో లేదు. నరనరాన్నీ కొరుక్కుతినే బండచాకిరీ, క్రూరమైన చలీ, చాలీ చాలని పంటలూ, ఇంటెడు మనుషులూ – ఎక్కడి నుంచిగానీ వచ్చే పూచికపుల్లపాటి సహాయం లేక పోవటం – అన్నీ వాళ్లను క్రుంగదీశాయి. ఉన్న వాళ్లూ సమర్థులూ, తక్కిన వాళ్ళకు తోడ్పడట మనేదే లేదు. వాళ్ళుకూడా అందరిలాగానే అవినీతి పనులు, తాగి తందనాలాడుతారు. ఒక ఆఫీసరు దగ్గిరుండే చిన్న గుమాస్తాకూడా రైతులంటే నిరా ధారంగా గాలికి తిరిగే వాళ్ళను చూసినట్టు చాలా

నీచంగా చూసేవాడు; గ్రామపెద్దల్ని కూడా 'ఒరే' 'అరే' అని పలకరించేవాడు; అంతేకాక, వాళ్ళను అలా చూడటానికి తనకు హక్కున్నదనుకునేవాడు. ఊళ్లో దుర్మార్గాలు చెయ్యటానికీ, ఊరిని చెడగొట్ట టానికీ, జనాన్ని భయపెట్టటానికీ అప్పుడప్పుడు వచ్చే పేరాసగల సోమరి అధికారులవల్ల ఊరికి, నిజంగా, ఏరకమైన సహాయంగానీ, ఆదర్శంగానీ, వుంటుందా? గత శీతకాలంలో, కొరడాదెబ్బల శిక్షకు వాళ్ళు కిర్యాక్‌ను నడిపించుకు పోతున్నప్పుడు అక్కడ పోగైన పెద్దవాళ్ళ ముఖాల్లో కనిపించిన దైన్యమూ నైచ్యమూ వోల్గాకు కళ్ళకు కట్టినట్టు కనిపిస్తు న్నాయి... ఇదంతా తలచుకుంటే ఆమెకు బాధా కరంగా వుంది; రైతుల్ని చూస్తే, పాపం, విచారం వేస్తుంది. ఆమె అలా వెనక్కు వెనక్కు ఇళ్లకేసి చూస్తూ, ముందుకు సాగిపోతున్నది.

వాళ్ళను రెండుమైళ్ళు సాగనంపి మార్యా వాళ్లదగ్గర సెలవుతీసుకొని, ఆగి మోకాళ్లమీద కూర్చొని మొహం నేలకు వాల్చి, "మళ్లీ ఒంటరి ముండనైనాను! నా ఖర్మ! ఈ బతుక్కు ఇక సుఖంలేదు!" అని ఏడవటం మొదలుపెట్టింది.

ఇలా ఆమె చాలాసేపు ఏడుస్తూ కూర్చొని వుంది. ఆమె అలా మోకాళ్లమీద నిశ్చ

లంగా కూర్చొని వుండటమూ, అప్పుడప్పుడు పక్కలకు ఊగటమూ, తల చేతుల్లో పట్టుకోవటమూ -ఆమెమీదుగా కాకులు ఎగురుతూ వుండటమూ- ముందుకుపోతున్న వోల్గా శాపాలకు కూడా చాల సేపటిదాకా కన్పిస్తూనే వుంది.

సూర్యుడు నడినెత్తికెక్కుతున్నాడు. వేడి ఎక్కువైంది. ఝుకోవో వెనక ఎక్కడో దూరాన వుండిపోయింది. వోల్గా శాసాలకు ఈ నడక సుఖంగానే వుంది. క్రమంగా వాళ్లు ఆ గ్రామాన్నీ మార్యానూకూడా మరచిపోయారు. సంతోషంతో ముందుకు సాగిపోతున్నారు. త్రోవన కనిపించే ప్రతిదీ వాళ్లకు సరదాగా వుంది: ఒక పురాతనపు కాటిదిబ్బ; ఒకదాని తర్వాత ఒకటి వరుసగా పోతూ దిఙ్మండలంలో కలిసిపోయే తంతిస్తంభాలూ, తమాషాగా ఝుంకారంచేసే తీగెలూ; చుట్టూవున్న పచ్చటి చెట్లలో సగం దాగివున్న భవనమూ, అందులోంచి వచ్చే చెమ్మతో కూడిన వాసనా, ఎవరో అదృష్టవంతులు అందులో నివసిస్తున్నట్టు కనిపించే ఆ తీరూ; విశాలమైన ఆ పచ్చిక పొలాల మీద తెల్లటి పొడలాగా చచ్చిపడివున్న గుర్రమూ అన్నీ, కనిపించే ప్రతిదీ వోల్గా శాపాలకు ఆకర్షణీయంగానే వుంది. భరతపక్షి విరతి లేకుండా

కూస్తున్నది. పరిగ పిట్టలు పరస్పరం పలకరించుకుం టున్నాయి.

మధ్యాహ్నవేళకు వాళ్ళు ఒక పెద్దగ్రామం చేరుకున్నారు. ఆ విశాలమైన వీధిలో వాళ్ళకు జెనరల్ ఝుకోవ్ వంటవాడు ఎదురు పడ్డాడు. ఎండకు వడిలిపోయాడు. అతని బట్టతల ఎర్రగా ఆ ఎండలో మెరుస్తున్నది. మొదట్లో అతనూ వాళ్లూ ఒకళ్ళ నొకళ్లు గుర్తించనేలేదు. కాని అంతలో వెనుదిరిగి చూసి, గుర్తించుకుని, ఒక్క మాటకూడా మాట్లాడకుండా, ఎవరిత్రోవన వారు వెళ్ళిపోయారు. ఉన్నవాళ్ళ ఇళ్లులాగా కనిపించే కొత్త కుటీరం దగ్గిర ఆగి, తెరచివున్న కిటికీలోంచి లోపలికి చూస్తూ, నమస్కరించి, బిగ్గరగా ఆసన్నని మొత్తనిస్వరంతో ప్రార్థిస్తున్నది :

"ఓ సనాతన క్రైస్తవులారా, ఏసుక్రీస్తు మొహంచూచి, బిచ్చం వెయ్యండి! మీరు ఎంత వెయ్యగలిగితే అంతే చాలు! స్వర్గరాజ్యంలో మీ తలిదండ్రుల ఆత్మలు శాశ్వతశాంతి పొందుతాయి!"

తల్లిమాటల్నే శాషా ప్రతిధ్వనిస్తున్నది :

"ఓ సనాతన క్రైస్తవులారా, ఏసుక్రీస్తు మొహంచూసి; బిచ్చం వెయ్యండి! మీరు ఎంత వెయ్యగలిగితే అంతే చాలు! స్వర్గరాజ్యంలో..."

# సార్జెంటు

"సార్జెంట్ ప్రిషిబయేవ్! నువ్వు, సెప్టెంబరు మూడో తేదీన కాన్‌స్టేబిల్ జిగిన్, గ్రామపెద్ద ఆల్యాపోవ్, పోలీస్ ఎఫిమోవ్‌లనూ, ఇద్దరు ప్రత్యేకోద్యోగులనూ, మరి ఆరుగురు రైతులనూ–మీద పడి కొట్టావనీ; అందులో మొదటి ముగ్గురూ తమ అధికార విధులు నిర్వహిస్తుండగా నీ దౌర్జన్యం జరిగిందనీ: నీమీద నేరం ఆరోపించబడింది. ఈ నేరం అంగీకరిస్తావా?"

ప్రిషిబియేవ్–ముడతలు పడి, ఉద్వేగం కనిపించే ముఖంతో – అంతలో నిటారుగా రొమ్ము విరుచుకొని సైనికుడి పద్ధతిలో నిలబడి, ఎలుగు రాచిన గొంతుకతో, ఆజ్ఞాపిస్తున్నట్టు, ప్రతిమాటా నొక్కి వక్కాణిస్తూ, జవాబు చెబుతున్నాడు:

"అయ్యా, భద్రతా న్యాయమూర్తీ! అన్ని న్యాయ సూత్రాలప్రకారమూ, ప్రతిఒక్క పరిస్థితినీ

అన్యోన్యంగా అర్థంచేసుకోవలసిన కారణం వుందని వేరే చెప్పనక్కరలేదు. తప్పుచేసింది నేనుకాదు, వాళ్ళందరూ తప్పు చేశారు. ఇదంతా ఈ చచ్చిన శవంమూలంగా వచ్చింది – వీడు స్వర్గానికి పోతాడు గాక! మూడో తేదీన, నేనూ నాభార్య యాన్ఫిసా ఇద్దరం కలిసి శాంతంగా సక్రమంగా నడిచి పోతున్నాం. హఠాత్తుగా అటుచూద్దునుగదా, ఏం కనిపించింది, నానారకాల గుంపులూ నది ఒడ్డున ప్రోగై నిలబడి వున్నారు. నేనడుగుతున్నాను: ఏ హక్కుల ప్రకారం వాళ్ళు, అక్కడ సమావేశ మైనారు? ఎందుకోసం? జనం గుంపులుగా తిరగా లని ఎక్కడన్నా శాసనం వుందా? 'చెదరిపొండి!' అని నేను ఆజ్ఞాపించాను. తర్వాత, ఇండ్లకు పొండని నెట్టడం మొదలు పెట్టాను. వాళ్ళనుమెడ మీద కొట్టి, వెళ్ళగొట్టమని పోలీసువాడిని ఆజ్ఞా పించాను..."

"ఒక్క ప్రశ్న, నువ్వు కాన్‌స్టేబిల్‌వి కాదు; ఊరిపెద్దవూ కాదు గదా! మరి, ఈ గుంపుల్ని చెదరగొట్టటం నీకేం పని?"

"వాడికేం పని, లేదు! వాణ్ణి ఇంక వదలిపెట్ట కండయ్యా! ఇప్పటికి పదిహేనేళ్లనించీ మా ప్రాణా లుతోడుతున్నాడు! వాడు సైన్యంలోనుంచి

వచ్చింది లగాయతూ, ఊళ్లో జీవితమే లేకుండా పోయింది. మమ్మల్ని హింసించటం తప్ప, వాడు చేసిందేమీ లేదు!" అని కోర్టు గది నాలుగు ప్రక్కలనుంచీ వివిధ స్వరాలు వినిపిస్తున్నాయి.

వెంటనే, గ్రామపెద్ద అందుకున్నాడు: "అంతే నయ్యా, ఊరంతా ఘోషిస్తున్నది. వాణ్ణి వదిలి పెట్టటానికి వీల్లేదు! దేవతా విగ్రహాలు చేతపట్టు కొని మేము చర్చి ఉత్సవాలు జరుపుతున్నప్పుడైనా సరే, పెళ్లిళ్ళు చేసుకుంటున్నాసరే, ఏదన్నా ప్రమా దం జరిగినప్పుడైనా సరే, – ఎక్కడ పడితే అక్కడ వీడు ప్రత్యక్షమై, గందరగోళం చేస్తూ, ఏమిటో అధికారం చెలాయిస్తుంటాడు. పిల్లల చెవులు మెలి పెడతాడు. ఎవరితోనన్నా మాట్లాడి పోతారేమో నని ఆడవాళ్లమీద, పెద్దమామగారిలాగా, ఒక కన్నువేసి వేగులు తీస్తుంటాడు. ఆమధ్య ఒకనాడు ఇంటింటికీ వచ్చి పాటలు పాడకూడదనీ, దీపాలు ముట్టించకూడదనీ ప్రతి ఒక్కరికీ ఆజ్ఞాపించి పోయాడు. పైగా, 'జనం పాటలు పాడుకోవాలని ఎక్కడా శాసనం లే'దంటాడు."

"ఆపు! నువ్వు చెప్పుకునే సమయం వస్తుంది. ఇప్పుడు ప్రిషిబయేవ్‌ను చెప్పుకోనీ! చెప్పు, ప్రిషి బయేవ్!" అని భద్రతా న్యాయమూర్తి అన్నాడు.

## సార్జెంటు

ప్రిషిబయేవ్ గురగురలాడుతూ చెబుతున్నాడు:
"చిత్తం, అయ్యా? గుంపుల్ని చెదరగొట్టం నాపని కాదని తమరు సెలవిచ్చారు. ...మంచిదేకాని, అయ్యా... మరి శాంతి భద్రతలకు భంగం కలిగితే ఏమయ్యేట్లు? ఏమైనా, మనం జనాన్ని నీచంగా తిరగనివ్వలేము. జనం వాళ్ళ ఇష్టం వచ్చినట్లు చెయ్యాలని శాసనం ఎక్కడుంది? నాకు తెలేదండి, అయ్యా! నేనే కనక, వాళ్ళను వెంటాడి అదుపులో పెట్టకపోతే, ఎవరు పెడతారు! ఇక్కడ ఎవ్వరికి ఏది ఎలా చెయ్యాలో తెలేదు. నేను ఒక్కణ్ణే, అయ్యా, ఊళ్ళోకల్లా నేను ఒక్కణ్ణే, అని మీరనుకోవచ్చు, ఈ అలగాజనంతో ఎలా వ్యవహారం చెయ్యాలో తెలిసినవాణ్ణి! ఏది ఏమిటో నాకు తెలుసు. నేనేం గొడ్లు కాసుకునేవాణ్ణికాదు; నాన్ కమిషన్ ఆఫీసర్ని, క్వార్టర్ మాస్టర్ సార్జెంట్ని. నేను వార్సాలో పనిచేసినప్పుడు హెడ్ క్వార్టర్సుతో సంబంధించి వుండేవాణ్ణి. అయ్యా, ఆ తర్వాత, సగౌరవంగా నేను సైన్యంలోనుంచి వీడ్కోలు పొందిన తర్వాత, అగ్ని మాపకదళంలో పనిచేశాను. తర్వాత జబ్బుచేసి, ఆ పని మానుకొని, ఉన్నత కుటుంబాల పిల్లలకోసం పెట్టిన జూనియర్ హైస్కూల్‌లో గేటుకాపలావాడిగా రెండేళ్ళ

పాటు పనిచేశాను. నాకు అన్ని నియమాలూ నిబంధనలూ తెలుసు! కాని, రైతంటారా, వాడు వట్టి మూర్ఖుడు. వాడికి ప్రాథమిక సూత్రాలుకూడా అరంకావు. కనుక వాడి శ్రేయస్సుకోసమే నేను చెప్పేది ఎలా పనికివస్తుందో తెలుసుకోని, వాడు నేను చెప్పినట్లల్లా చెయ్యవలసివుంటుంది. ఉదాహరణకు - ఈ సంగతే తీసుకోండి! గుంపుల్ని చెదరగొడుతూ నేను ఇక్కడ వున్నాననుకోండి, అక్కడ సగాటిగా నది ఒడ్డున ఇసకమీద నదిలో పడి చచ్చినశవం పడివుంది. వాడికి అక్కడ వుండటానికి ఏమి హక్కువున్నదీ అని అడుగుతున్నాను. అది న్యాయమేనా? కానిస్టేబిల్ ఏమాలో చిస్తున్నాడు కానిస్టేబిల్‌ను పిలిచి నేను అడిగాను: 'అధికారులకు తెలియజెయ్యకుండా ఎందుకున్నావు? ఈ నదిలో పడ్డశవం తనంతటతానే పడింవుటుందో, లేకపోతే, సైబీరియా లక్షణాలు కనిపిస్తున్నాయో! ఇది హత్యానేరం కావచ్చు!' అని చెప్పాను. కాని, కానిస్టేబిల్ జిగిన్ వినిపించుకోకుండా, సిగరెట్ పొగ ఊదుతున్నాడు. అంతేకాక, 'వీడెవడు, మిమ్మల్నందర్నీ శాసిస్తున్నాడు? వీడెక్కణ్ణించి వచ్చాడు? వీడు చెప్పకుండా ఏది ఏమిటో మనకు తెలేదా?' అని

గుంపులో అంటున్నాడు. నేను చెప్పాను: 'ఏది ఏమిటో నీకు తెలిసినట్టు లేదు, మూర్ఖుడా, నువ్వు కనక అలా నుంచోని నేను అడిగేది గమనించక పోయావా అంటే...' అంటుండగానే అతను జవాబు చెప్పాడు- 'జిల్లా పోలీసు ఆఫీసరుకు నిన్ననే తెలియజేసా'నని. 'జిల్లా పోలీస్ ఆఫీసరు కెందుకు? న్యాయశాస్త్రంలో ఏ సూత్రం ప్రకారం? నీళ్ళలో మునిగిచావటం, ఉరిపోసుకోటం, ఇలాంటి విషయాల్లో జిల్లాపోలీసు ఆఫీసరు చెయ్యగలిగిందేమన్నా వుందా! చూడు, ఇక్కడొక శవం వుందిగదా, ఇది క్రిమినల్ కేసు, అంటే స్పష్టంగా సివిల్ వ్యాజ్యమన్నమాట!' అన్నాను. 'కనుక చెయ్యవలసిందేమిటంటే, తక్షణం పరీక్షించే మాజిస్ట్రేట్‌కూ గౌరవనీయులైన న్యాయమూర్తులకూ తెలియజెయ్యాలి' అన్నాను. 'అన్నింటికంటే ముందు నువ్వు ఒక రిపోర్టువ్రాసి భద్రతా న్యాయమూర్తి గారి సమ్ముఖానికి పంపుకోవాలి' అన్నాను. కాని కానిస్టేబిల్ తీరావిని, నవ్వేసాడు. రైతులూ అంతే. వాళ్ళంతా నవ్వారయ్యా! తమకు ప్రమాణంచేసి చెప్పగలను. ఇదుగో వీడు నవ్వాడు, అదుగో వాడు, జిగిన్, జిగిన్ కూడా నవ్వాడు. "ఏమిటా ఎగతాళి?" అని గద్దిస్తే, కాన్‌స్టేబిల్ అన్నాడు గదా: 'ఇలాంటి కేసులు భద్రతా న్యాయమూర్తి అధికారం కిందికి

రావు' అని అన్నాడు. ఆమాటలు వినేటప్పటికే నాఒళ్లంతా వేడెక్కి పోయింది. 'ఏం కాన్‌స్టేబిల్, నువ్వామాటలు అన్నావా? లేదా?' అని సార్జెంటు జిగిన్ వంకకు తిరిగాడు.

"ఔను అన్నాను." అన్నాడు జిగిన్.

"నువ్వా మాటలు ఆ అలగా జనంముందు అన్నప్పుడు ప్రతి ఒక్కడూ విన్నాడు: 'ఇలాంటి కేసులు భద్రతా న్యాయమూర్తి అధికారం కిందికి రావు' అని. నా ఒళ్ళు మండిపోయిందయ్యా! నిజంగా నా ఊపిరి పోయినట్టయింది. గద్దించాను: 'వెధవా, మళ్ళీ ఆ మాట అను, ఇప్పుడన్నమాటే మళ్ళీ అను!' అని. వాడు మళ్లీ అన్నాడు. 'అలాంటి మాటలు గౌరవ నీయులైన భద్రతా న్యాయమూర్తిని గురించి ఎట్లా అంటున్నావు? నువ్వు, పోలీసు అధికారివి, ప్రభుత్వానికి వ్యతిరేక మన్నమాట! ఏమిటీ! న్యాయమూర్తి కనక నీ మాటలు మనస్సులో పెట్టుకున్నారా అంటే నిన్ను ఏమైనా చేసెయ్యగలరు తెలుసా?' అని అడిగాను. 'ఇలాంటి రాజకీయపు వాగుడుకు ఆయన నిన్ను ఎక్కడికి పంపిస్తారో నీకేమన్నా తెలుసా?' అన్నాను. అంతలో తగుదునంటూ ఈ గ్రామ పెద్ద 'భద్రతా న్యాయమూర్తి తన అధికారాన్ని మించి ఏమీ చెయ్యలేడు. చిన్నచిన్న కేసులు మాత్రమే

ఆయన అధికారంలోకి వస్తాయి' అంటూ వచ్చాడు. సరిగ్గా అతను ఇవ్వేమాటలన్నాడు. అంతా విన్నారుకూడా. 'మీరు అధికారుల్ని అగౌరవిస్తున్నారా? చూడండి, నేను చెప్పినట్టు నడుచుకుంటారా సరేవుంది. లేదా, దుఃఖపడతారు' అన్నాను. నేను వార్సాలో పనిచేస్తున్నప్పుడు గానీ, బడి గేటుదగ్గిర వున్నప్పుడు గానీ, ఏదన్నా వినకూడనిమాట వినబడితే వెంటనే సైనికుడికోసం చూసే వాణ్ణి. సైనికుడు కనిపించగానే, 'ఆఫీసర్! ఇటురా!' అని పిలచి, అంతా రిపోర్టు చేసేవాణ్ణి. కాని ఈ పల్లెటూళ్లో ఎవడికి రిపోర్టు చెయ్యాను? ఈ పరిస్థితిలో నాకు చాలా కష్టం వేసింది. అలగా జనమంతా స్వయం రాజా స్వయం మంత్రిగా విచ్చలవిడిగా సంచరిస్తూ వుంటే నేను చూస్తూ వూరుకోలేను. అందువల్ల, ఊరిపెద్దకు ఒక్కటిచ్చుకున్నాను. నిజానికి, అంతగట్టి దెబ్బకూడా కాదు, తేలికగానే కొట్టాను: ముందుముందన్నా తమవంటి వారిని గురించి అలాంటి మాటలాడటం కంటే మరేమన్నా మంచి మాటలు నేర్చుకుంటాడు లెమ్మని. తర్వాత కాన్‌స్టేబిల్ వాడిపక్షాన వాగటం మొదలెట్టాడు. కనుక సహజంగానే నేను కాన్‌స్టేబిల్ మీదికి పోయాను. కొంచెం ఘర్షణజరిగింది ఇక నావల్లు నాకు తెలేలేదయ్యా. కొన్నికొన్ని సమయాల్లో

వాళ్లను తన్నకుండా, మనం ఎలా వుండగలం? మనం ఒక మూర్ఖుణ్ణి తన్నకుండా విడిచిపెడితే ఆ పాపం మన ఆత్మకు చుట్టుకుంటుంది. అదికూడా, ముఖ్యంగా శాంతికి భంగంకలిగి, వాడికి అది తగి వున్నప్పుడు మరీను!"

"ఆగు! అక్కడ శాంతి భద్రతలు కాపాడ టానికి తగిన అధికారులున్నారు గదా మరి, కాన్‌స్టేబిల్, గ్రామపెద్ద, పోలీసు!" అన్నాడు న్యాయ మూర్తి.

"కాన్‌స్టేబిల్ ప్రతి ఒక్క విషయం మీద కళ్ళుపెట్టుకు కూచోలేడు. అంతేకాక, అతను నామాదిరిగా విషయాలు అర్థం చేసుకోలేడు కూడా..." అని జవాబు చెబుతున్నాడు సార్జెంటు.

"బుర్ర కెక్కించుకో: ఇది నీపని కానే కాదు!"

"ఎందుకండి, అయ్యా? తమ అభిప్రాయం ఏమిటి-నాపని కానేకాదా? విపరీతంగావుందయ్యా. జనం అసహ్యంగా ప్రవర్తిస్తుంటారు గాని, ఇది నాపని కాదా? ఆ జనాన్ని వీపుమీద తట్టి బుజ్జ గించమంటారా? నేను వాళ్లను పాడుకోనివ్వటం లేదని ఇక్కడికివచ్చి తన్నుకుంటున్నారు. పాడు కున్నందువల్ల ప్రయోజనం ఏమిటి? ఏదన్నా ఉప యోగకరమైంది చెయ్యటం మానేసి, పాడుకుంటూ కూచుంటారు. ఇప్పుడిప్పుడే, రాత్రిళ్ళు దీపాలు

వెలిగించి, వాటిచుట్టూ కూచొని, కబుర్లాడటం నేర్చుకుంటున్నారు. పొద్దూకగానే నిద్రపోవలసింది పోయి, వెకిలిగా మాట్లాడుకుంటూ అల్లరి చేస్తారు. అదంతా వ్రాసిపెట్టి వుంచాను!"

"ఏం వ్రాశావు?"

"వాళ్ళనుగురించే. దీపాలు వెలిగించి చుట్టూ కూర్చోటం గురించి."

సార్జెంట్ జేబులోంచి జిడ్డులాగావున్న ఒక కాగిత తీసి, కళ్ళజోడు పెట్టుకొని, చదవటం మొదలుపెట్టాడు:

"దీపాలు వెలిగించే రైతులు ఎవరు: ఇవాన్ ప్రొఖొరోవ్, సావా మికిఫొరోవ్, పయోటర్ పెట్రోవ్, సుస్ట్రోవా (సైనికుడి వితంతువు-సెమ్యాన్ కిస్లోవ్ తో పాపిష్టి జీవితం గడుపుతున్నదికూడా) ఇవాన్ స్విర్ షొక్ మంత్రవిద్య నేరుస్తున్నాడు. అతని భార్య మంత్రగత్తె, రాత్రిపూట ఊళ్లోవాళ్ల ఆవుల పాలు పితుక్కొచ్చుకుంటుంది."

"చాల్లే అంతవరకు!" అని ప్రిషిబయేవ్ను ఆపి, న్యాయమూర్తి సాక్షులను ప్రశ్నించటం ప్రారంభించాడు.

సార్జెంట్ ప్రిషిబయేవ్ ముక్కద్దాలు మొహం మీదికి జరుపుకుని, తనపక్షం పలకనట్టు కనిపిస్తున్న న్యాయమూర్తివంక ఆశ్చర్యంగా తేరిపార జూస్తు

న్నాడు. ముందుకు పొడుచుకొచ్చినట్లుండే అతని కళ్ళు మెరుస్తున్నాయి. ముక్కు కోపంతో కెంపెక్కింది. ఒకసారి భద్రతా న్యాయమూర్తివంకా, ఒకసారి సాక్షులవంకా చూస్తాడు. కాని, అసలు న్యాయమూర్తి ఎందుకింత ఆందోళనపడతాడో అర్థంకాలేదు. కోర్టు గదిచుట్టూ ఒకసారి ఏమిటో గుసగుసలూ, మరోసారి ఏమిటో నవ్వులూ వినపడుతున్నాయి. ఇదికూడా ఎందుకో సార్జెంటుకు తెలీలేదు. శిక్షకూడా అతనికి ఊహాతీతమైందే: నెల రోజులు జైలు!

గాభరాగా చేతులు పైకెత్తి అడుగుతున్నాడు. "ఎందుకని! ఏ చట్టంప్రకారం?"

ప్రపంచం చాలా మారిపోయిందనీ, ఇక ఇందులో జీవించటం అసాధ్యమనీ అతనికి బాగా స్పష్టపడింది. కొంతసేపు నిరాశా విషాదాలకు లోనైనాడు. కాని కోర్టునుంచి బయటికి పోతూ, అక్కడ రైతులంతా గుమిగూడి, మాట్లాడుతూ వుండటం చూశాడు. ఎంతమాత్రం అతని స్వాధీనంలో లేని అలవాటు ప్రకారం, నిటారుగా నిలబడి బిగ్గరగా కోపంగా అరచాడు:

"ఏయ్ గుంపు! చెదరిపొండి! కదలండి! ఇళ్ళకు వెళ్ళండి!"

# ముద్దాయి

ఒక దుర్బలుడైన చిన్నరైతు, శరీరమంతా చర్మం వ్రేలుకాడుతూ, ఒక అతుకుల లాగూ ముతకచొక్కా తొడుక్కొని, మాజిస్ట్రేట్ ముందు నిలబడివున్నాడు. గడ్డం బాగా పెరిగి స్ఫోటకం మచ్చలతో ఆ మొహంమీద, క్రిందికి జారిన ఆ కను బొమల చర్మం క్రింద ఎక్కడో కనపడీ కనపడని ఆ కళ్లలోనూ గంభీరమైన విషాదం గోచరిస్తున్నది. దువ్వెన తగిలి ఎంతకాలమో అయి, పీచు రేగిన ఆదుబ్బుతల అతన్ని సాలీడు లాగా కనిపించేట్టు చేస్తున్నది. దాంతో అతను మరీ భీకరంగా కనపడు తున్నాడు అతని కాళ్లకు చెప్పులుకూడా లేవు.

మాజిస్ట్రేట్ ప్రారంభించాడు: "డెనిస్ గ్రిగో ర్యేవ్! ఇలా దగ్గిరికి వచ్చి, నా ప్రశ్నలకు జవాబు చెప్పు, ఈ జూలై నెల ఏడవ తేదీ ఉదయం రైల్వే కావలి మనిషి సెమనోవిచ్ ఆకిన్‌ఫోవ్ కాపలా

కాస్తూ, నూటనలభై ఒకటో మైలురాయి దగ్గర నువ్వు రైలుపట్టాలుకూ స్లీపర్ కూ బిగించిన 'నట్టు' ఊడదీస్తుండగా, నిన్ను పట్టుకున్నాడు. ఇదిగో ఆ 'నట్టు'!... ఈ పేర్కొన్న 'నట్టు'తో సహా నిన్ను అతను అరెస్టు చేశాడు. ఇది నిజమేనా?"

"ఏమిటి?"

"అకిన్ ఫోవ్ చెప్పిన ప్రకారంగా, ఇదంతా జరిగిందా? లేదా?"

"ఔను. జరిగినమాట నిశ్చయమే."

"సరే, అయితే నువ్వు ఆ 'నట్టు' ఎందుకోసం ఊడదీస్తున్నావు?"

"ఏమిటి?"

"ఏమిటి, ఏమిటనటం మానేసి, ప్రశ్నకు జవాబు చెప్పు: ఎందుకోసం నట్ ఊడదీస్తున్నావు?"

"నాకు అవసరమే లేకపోతే, అసలు ఊడ దీసే వాణ్ణే కాదు" అని పైకప్పువంక ఓరగంట చూస్తూ, డెనిస్ జవాబు చెప్పాడు.

"నీకా నట్ దేనికి కావలసి వచ్చింది?"

"నట్టా? ఈ నట్లు మేము గాలాలకు అడుగున బరువుకు కట్టుకుంటాము."

"మీరంటే ఎవరు?"

"మేమే, ప్రజలం...క్లిమోవో రైతులం అన్నమాట."

విను, తమ్ముడూ; నాతో పరాచకాలాడకు, జాగ్రత్తగా మాట్లాడు. గాలాల బరువుల్ని గురించి నాతో అబద్ధాలు చెప్పి లాభంలేదు."

"నేను నాజీవితంలో ఎన్నడూ అబద్ధం ఆడ లేదు. ఇవాళ ఇక్కడ అబద్ధ మాడుతున్నానం టారా ..." అని గొణుక్కుంటూ, కళ్ళు చికిలిస్తూ డెనిస్ అన్నాడు; "గాలానికి బరువు కట్టకుండా మీరు చేపలు పట్టగలరా, అయ్యా? మీరు గాలా నికి ఏదన్నా ఎరకడితే బరువు కట్టకుండా నీటిలో మునుగుతుందా?... ఇదేనా నేనుచెప్పిన అబద్ధం... నీటిలో మునక్కుండా ఆ ఎరనీటి మీద తేలినందు వల్ల వచ్చేదేమిటి? అసలు నీ గాలం నీటి అడుక్కు పోయినప్పుడే చేపలు ముట్టుకుంటాయి. ఎర పైకి తేలినప్పుడు పట్టేది ఒక్క పెద్దతల చేపమాత్రమే. అదికూడా ఎప్పుడో ఒకసారి. అసలు మా నదిలో పెద్దతల చేపలు లేనేలేవు...వాటికి కావలసినంత జాగా వున్నచోటగాని, అవి వుండవు."

"పెద్దతల చేపను గురించి, నాకెందుకు, చెబు తున్నావు?"

"ఏమిటీ? ఎందుకా, మీ అంతట మీరే అడి గారు గదా! మావైపున పెద్ద మనుషులుకూడా అలాగే చేపలు పడతారు. గాలానికి బరువు లేకుండా చిన్నపిల్లలుకూడా చేపలు పట్టటానికిపోరు. నిజానికి, ఎవడన్నా మతిలేనివాడు పోతేపోవాలి, బరువు కట్టుకో కుండా. మతిమాలినవాళ్ళకునియమమేముందికనక!"

"అయితే, నువ్వు గాలానికి బరువు కట్టుకుందా మని నట్ ఊడదీశానంటావు. అంతేనా?"

"మరెందుకు? ఆడుకోటానికికాదు!"

"కాని నువ్వు ఏదన్నా సీసంముక్కగానీ, ఇనప మేకుగానీ బరువుకోసం తీసుకొని వుండవలసింది."

"సీసంముక్క రోడ్డుమీద దొరకదు గదా, డబ్బు పెట్టికొనుక్కోవాలి. మేకు అంటారా, పనికి రాదు. మనకు నట్ కంటే మంచిదేదీ దొరకదను కోండి...దానికి చిల్లివుంటుంది, బరువుకు బరువూ!"

"పరాచకాలాడుతున్నాడు! తాను నిన్ననే పుట్టినట్టుగానో, ఇప్పుడే ఆకాశం నుంచి ఊడిపడ్డట్టు గానో! ఓరి మూర్ఖుడా, ఈ నట్లు తియ్యటం ఎక్కడికి దారి తీస్తుందో, నీకు తెలేదా? కాపలా వాడు కనిపెట్టి వుండక పోయినట్టయితే, రైలు పట్టాలు తప్పి పడిపోయేది; జనం చచ్చి పోయే వాళ్ళు—నువ్వు అనేకమంది ప్రాణాలు తీసేవాడివి!"

దేవుడు చల్లగా వుండాలి! అయ్యా, జనాన్ని చంపటమా? మేము క్రైస్తవ మతస్థులమా? లేక బందిపోటు దొంగలమా? భగవంతుడి దయవల్ల, అలాంటి ఆలోచన కలలోనైనా రాకుండా మేము ఇన్నాళ్ళూ జీవించాం, చంపటం దాకా దేనికి... తల్లీ! మమ్మల్ని రక్షించు! మామీద దయచూపు! మీరేమిటి చెబుతున్నారయ్యా?"

"మరి రైళ్ళు ఎందుకు పడతాయనుకుంటున్నావు? రెండు మూడు నట్లు తీసేస్తేసరి, రైలు పడిపోతుంది!"

డెనిస్, మాజిస్ట్రేట్ మాటల్ని నమ్మలేకుండా, ఆయనవంకకు కళ్ళు తిప్పి, తిరస్కారంగా అన్నాడు:

సరేగాని, ఎన్నేళ్ళనుంచీ మేము ఈ ఊళ్లో వాళ్లమందరం నట్లు తీస్తున్నాము! మమ్మల్ని భగవంతుడు చల్లగానే చూస్తున్నాడు. ఇప్పుడు మీరు రైళ్ళు పడటమనీ, మనుషుల్ని చంపటమనీ చెబుతున్నారు. నేను ఒక పట్టా ఎత్తుకుపోయిగానీ, పట్టాలకు ఓ పెద్దదుంగ అడ్డంపెట్టిగాని వుంటే-రైలు పడుతుందంటే అర్థంవుంది కాని, నెథవనట్టు!"

"ఆ నట్టే పట్టాలను స్లీపర్లకు అతికించి వుంచుతుందని మనస్సులో పెట్టుకో!"

"అది మాకు తెలుసు...అందుకే అన్నినట్లూ ఊడదియ్యం ... కొన్ని వదిలిపెడతాం... మేమంత మెదడు లేకుండా పని చెయ్యం మాకు తెలుసు!" డెనిస్ ఆవులించి, నోటి దగ్గర చిటిక వేశాడు.

"నిరుడుఇక్కడఒకరైలు పట్టాలు తప్పిపోయింది. కారణం ఏమిటో యిప్పుడు అర్థమవుతున్నది." అన్నాడు మాజిస్ట్రేట్.

"క్షమించి, మరోసారి చెప్పండి!"

"నిరుడు రైలు పట్టాలు తప్పింది ఎందుకో స్పష్టమైందన్నాను. ఇప్పుడు నాకు అర్థమవుతున్నది!"

"మారక్షకులు, మీరు అందుకే చదువుకుంది. ప్రతిదీ అర్థం చేసుకోటానికి. ఎవరికి తెలివి ఇవ్వాలో దేవుడికి తెలుసు... ఇక్కడ మీరు ప్రతిదీ, ఏది ఏమిటో, ఎలాగో విడమర్చి చెప్పారు. ఆ కాపలావాడున్నాడే, వాడు మాలాగే బుద్ధిలేని రైతు మెడపట్టుకుని నెట్టుకు పోతాడు. రైతుకు రైతుబుద్ధే వుంటుందని తెలిసిపోయింది. వ్రాసుకోండయ్యా, వ్రాసుకోండి – వాడు నన్ను దవడ మీద రెండుసార్లు కొట్టాడు, రొమ్ముమీదకూడా"

"వాళ్లు మీయిల్లు సోదా చేసినప్పుడు గంలో నట్టు పట్టుకున్నారు గదా? . అది ఏ ప్రదేశంలో ఊడదీశావు? ఎప్పుడు?"

"ఆ చిన్న ఎర్రపెట్టె కింద వున్ననట్టేనా, అయ్యా?"

"దాన్ని నువ్వు ఎక్కడ పెట్టావో నాకు తెలేదు. అసలు. దాన్ని ఎప్పుడు ఊడదీశావు?"

"నేను దాన్ని ఊడదియ్యలేదు. ఇగ్నాషా వున్నాడే, ఒంటికంటి సెమ్యోన్ కొడుకు, వాడు నాకిచ్చాడు. నేను చెప్పేది ఆ పెట్టె కిందవున్న నట్ మాట. మరి దొడ్లో బండి కిందవున్న నట్ వుందే, అది నేనూ మిత్రోఫాన్ ఇద్దరం కలిసి ఊడదీశాం."

"మిత్రోఫాన్ ఎవరు?"

"మిత్రోఫాన్ పెత్రోవ్... మీకు అతని సంగతే తెలేదా? అతను వలలు చేసి, పెద్దమనుషులకు అమ్ముతాడు. అతనికి అలాంటి నట్లు చాలా కావాలి. ప్రతి ఒక్క వలకూ పదన్నా కావల సొస్తాయి."

"విను. పీనల్ కోడ్ 1031 వ సూత్రం ప్రకారం, పట్టాలకు హాని కలిగించటం – అది ప్రమాదాలకు దారి తీస్తుందని అతనికి తెలిసివున్నట్లయితే – అది రైళ్ళకు అపాయం కలిగించటం కింద, పరిగణింపబడుతుంది ఏం, తెలిసిందిగదా! ఈ నట్లు ఊడదియ్యటం ఎక్కడికి దారి తీస్తుందో, నువ్వు తెలుసుకోక తప్పదు – దీనికి కఠినశిక్ష విధించాలి."

"నిజానికి, మీకెక్కువ తెలుసు... నేము మూర్ఖులం మాకేం అర్థమవుతుంది?"

"దీన్ని గురించి నీకంతా తెలుసు! కాని అబద్ధమాడి, బూకరిస్తున్నావు!"

"నేనెందుకు అబద్ధం చెప్పాలి? మీరు నామాట నమ్మకపోతే, ఊళ్లో విచారించండి గాలానికి బరువులేకుండా, చిరు చేపల్ని మాత్రమే పట్టుకోవచ్చు. వాటిని అసలు చేపలంటానికే వీలు లేదుగాని, అవైనా సామాన్యంగా చిక్కవు."

"ఏదీ, ఆ పెద్ద తల చేపను గురించి ఇప్పుడు చెప్పు!" అన్నాడు మాజిస్ట్రేట్ చిరునవ్వుతో."

"మా ప్రాంతంలో పెద్దతల చేపలు లేనే లేవు. బరువుకట్టకుండా, ఏదన్నా పురుగు ఎరపెట్టి, నేము గాలం వేసినట్లయితే ఎప్పుడన్నా ఒక్క పెద్దచేప చిక్కవచ్చు. అదికూడా ఎప్పుడూ జరిగేది కాదు."

"సరేలే, ఇక నిశ్శబ్దంగా వుండు!"

ఒక్క క్షణం నిశ్శబ్దం. డేనిస్ ఒక కాలిమీది నుంచి, రెండో కాలిమీదికి ఒరుగుతూ, ఆకుపచ్చ గుడ్డ కప్పిన టేబిల్ వంక చూసి, తాను గుడ్డను కాక సూర్యుణ్ణి చూస్తున్నట్టుగా కళ్లు మిటకరిస్తూ న్నాడు. మాజిస్ట్రేట్ త్వరత్వరగా వ్రాసుకు న్నాడు.

కొంచెంసేపు ఆగి, డెనిస్, "నేను వెళ్లనా, అయ్యా ?" అని అడిగాడు.

"ఏల్లేదు నిన్ను మా స్వాధీనంలో వుంచుకొని, జైలుకు పంపించాలి."

డెనిస్ గుడ్లు మిటకరించటం మానేసి, కను బొమ్మలెత్తి అధికారివంక ప్రశ్నార్థకంగా చూస్తు న్నాడు.

"ఏమంటారు ? జైలా ? నాకు తీరిక లేదే ! సంతకు పోవాలి; పంది కొవ్వుకింద ఈగర్ దగ్గరనుంచి మూడు రూపాయలు వసూలు చెయ్యాలి !"

నిశ్శబ్దంగా వుండు ! నాపని చెడగొట్టకు !"

"జైలుకు ... నేనేదన్నా తప్పు చేసివుంటే, పోతాను. కాని ఉత్తపుణ్యానికి వెళ్లమంటే ! నేను జైలు కెందుకెళ్లాలి ? నాకు తెలిసినంతవరకూ నేను ఎక్కడా దొంగతనం చెయ్యలేదు, ఎవ్వరితోనూ పోట్లాడలేదు. ... పన్నుల విషయంలో యింకా బకాయి వుందని చెబితే మా గ్రామపెద్దమాట నమ్మకండి .. బోర్డు శాశ్వత సభ్యుణ్ణి అడగండి... గ్రామపెద్ద క్రైస్తవుడు కాడు !"

"నిశ్శబ్దంగా వుండు !"

"నేను నిశ్శబ్దంగానే వున్నాను. మా గ్రామ పెద్ద మాట – అతను పన్ను విషయంలో అబద్ధం

చెప్పాడు. కావాలంటే నేను ప్రమాణంచేసి చెబు తాను...... మేము ముగ్గురం అన్నదమ్ములం: కుజ్మాగ్రిగోర్యేవ్, తర్వాత, ఈగర్ గ్రిగోర్యేవ్, ఆ తర్వాత డెనిస్ గ్రిగోర్యేవ్‌ని నేను."

"నువ్వు నాపని చెడగొడుతున్నావు...ఏయ్ సెమ్యాన్, వీణ్ణి బైటికి తీసుకుపో!" అని మాజిస్ట్రేట్ అరిచాడు.

ఇద్దరు బలమైన సైనికులు వచ్చి పట్టుకొని, బైటికి తీసుకు పోతూంటే, డెనిస్ ఇంకా చెబుతున్నాడు:

"మేము ముగ్గురం అన్నదమ్ములం. అయినా ఒకరికిగాను మరొకరం జవాబుదారీ కావలసిన అవసరంలేదు. కాని కుజ్మాపన్ను కట్టలేదు. అందుకు, ఓ డెనిస్, నువ్వు జవాబుదారీ అయినావు ... న్యాయమూర్తులు! మా వెనకటి యజమాని చచ్చి స్వర్గాన వున్నాడు - ఆయనే బ్రతికివున్నట్టయితే, మీకు న్యాయమూర్తులకు ఏది ఏమిటో చూపే వాడు... న్యాయం చెప్పేటప్పుడు, ఏది ఎలాగో, మీరు తెలుసుకోవాలి, ఎటు పడితే అటు చెప్పటం కాదు...ఒక మనిషిని శిక్షించటం న్యాయమే, అయితే తప్పుచేస్తేనే శిక్షించాలి! న్యాయం విచారించి మరీ శిక్షించండి!"

స మా ప్తి

